సరస్వతీ గ్రంథమండలి
అనుబంధమాలిక

# ఔరంగజేబు పాదుషా

మొసలికంటి సంజీవరావు

"మొగలాయీ దర్బారు", "సంజీవి",...."బక్సారుయుద్ధము"
మొదలగు గ్రంథముల కర్త

పాఠశాలల కుపయుక్తము : గజెట్టు, 172, 2-6-36

**1-25**

పబ్లిషర్సు: అద్దేపల్లి అండుకో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# పీ ఠి క



మహత్తర చరిత్ర విషయములను ప్రజానురంజకమగు శైలిని వ్రాయుటను సంకల్పించి ప్రచురించిన "బక్సారు యుద్ధము" సర్వజనాదరణీయమై, పాఠశాలలకు బఠనీయ గ్రంథముగా టెక్ట్సుబుక్కు కమిటీవారిచే నామోదింపఁబడి పాఠశాలలందుఁ బ్రచారము గాంచుటయే గాక, ఈ సంవత్సరము ఆంధ్రవిశ్వవిద్యాలయము నందలి ఇంటర్మీడియేటు పరీక్షకుఁ బఠనీయముగఁ దదధికారులు నిర్ణయించుటచేత, ఔరంగజేబుపాదుషా యను నీగ్రంథము నిపుడు ప్రచురించుటకు సాహసించితిని. ఇందలి తొలి మొదు ప్రకరణములును గొంత కాలము క్రిందట భారతిపత్రిక యందుఁ బ్రచురింపఁబడి యున్నవి. తదధికారులకు నేఁ గృతజ్ఞుఁడను. వాని నొకింత సవరించి మఱి రెండు ప్రకరణములు చేర్చితిని.

అద్భుతమగు నౌరంగజేబుపాదుషా చరిత్ర మెల్లరకు నవశ్యపఠనీయము. షాజహానుపాదుషా సంతానమునందుఁ ద్వితీయుఁడగు నౌరంగజేబు బాల్యముననే మోఘకృత్యము లొనరించి, జగదేక వీరుఁడని పేర్వడసి, పరిపాలనాదక్షుఁడని పేరొంది, వృద్ధజనకుఁడు వ్యాధిగ్రస్తుఁడైనంతనే యుద్ధసన్నద్ధుఁడై యాతని బంధించి, సోదరుల నడంచి, సామ్రాజ్యాధిపత్యము వహించిన యద్భుతవిషయము లిందు వర్ణింపఁబడి యున్నవి.

ప్రతిభాశాలియగు యదునాథసర్కారు విరచించిన ప్రసిద్ధగ్రంథము, ఔరంగజేబు చరిత్రమె నాకు ముఖ్యాధారము.

ఈ గ్రంథమును ముందుగఁ బరిశీలించి యేతత్ప్రచురణమునకుఁ బురికొల్పిన విద్వత్ప్రకాండులు, శ్రీయుత రావికంటి రామచంద్రరావు పంతులుగారు (M. A., L. T., Head Master, Bobbili), శ్రీయుత సుంకరి పార్థసారథినాయఁడుగారు (M. A., L. T., Vice Principal, Mrs. A. V. N. College), శ్రీయుత సూకూరు వేంకటరామదాసుపంతులుగారు (B. A., L. T., Head Master, M. R. College School, Vizianagram), శ్రీయుత గంటి జోగిసోమయాజులుగారు (M. A., L. T., Vidwan, Lecturer, Andhra University, Vizagapatam), శ్రీయుత వసంతరావు వేంకటరావు పంతులుగారు (M. Sc.) గ్రంథమును శీఘ్రముగ ముద్రింపించిన సరస్వతీ పవరు ప్రెస్సు ప్రొప్రయిటర్లు శ్రీయుత అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయఁడు గారును మత్కృతజ్ఞతకుఁ బాత్రులు.

పెద్దవీధి
విశాఖపట్టణము
6 - 1 - 34

మొసలికంటి సంజీవరావు

I was asked sometime back by Mr. M. Sanjiva Rao the author of the little book entitled "Aurangazebe Padisha" to go through it and express my opinion thereon. The very title of the book first created a prejudice in my mind on account of my natural aversion to read a book on history, and I surmised that it would be a mere catalogue of dry facts with dates. However, with a view to see what it was, I sat to hear only some of its pages, but to my surprise, I was told after a little time that it was read out to me from cover to cover, though the desire to hear more of its pages still persisted.

The manner is which the story of the fratricidal war is told, the simple and chaste language in which it is couched and the easy flowing style of the author created in my mind an interest which reminded me of Macaulay's "Narratives". The author's attempt to make history read like a novel without losing its historical value, is I believe, successful.

**The book is well fit to be in the hands of students of High Schools and Colleges.**

VIZIANAGRAM, 7—1—34

(Sd.) S. V. RAMADAS
Head Master
M. R. College School, Vizianagram

మ॥ రా॥ రా॥ శ్రీ రావికంటి సీతారామచంద్రరావు పంతులుగారు

ఎమ్. ఏ., ఎల్. టి., హెడ్ మాస్టరు

రాజావారి హైస్కూలు, బొబ్బిలి.

అస్మన్మిత్రులును బంధితులును నగు శ్రీయుత మొసలి కంటి సంజీవరావుగారు రచియించిన చరిత్రాత్మకమగు "ఔరంగ జేబు పాదుషా" యను గ్రంథమును నామూలాగ్రముగాఁ జదివి నాఁడను. ఇందలి భాషావైఖరి నాతికఠినమై చదువరుల కింపు నొదవించు సంస్కృతపదసంకలితమై మృదుమధురమగు వచన రచనాచాతుర్యంబును వెల్లివిరియుచున్నది. ఇయ్యది చరిత్రాంశమైనను నేదో యొక యుపాఖ్యానమువోలె చక్కని రచనాచమత్కృతితోఁ బాఠకులకు హృదయరంజకమై యల రారుచున్నది.

ఇందు నౌరంగజేబుపాదుషాయొక్క యనన్యసామాన్య ప్రతిభా విశేషంబులు, ధైర్యసాహసాద్యుదారగుణంబులు, కార్యనిర్వహణదక్షత, చతురోపాయధురీణత, అనిర్వాచ్య సమరనైపుణ్యము, సమయోచిత బుద్ధికౌశలము మున్నగు రాజనీత్యుద్బోధకములగు నంశములు ప్రత్యక్షముగ నాయా భాగములందుఁ జిత్రింపఁబడి యున్నవి.

ఇయ్యది చరిత్రాత్మకమైనను నీత్యుద్బోధకమై ముద్దు లొలుకు పదరచనాచమత్కృతిచే హృదయంగమమగు నవలా

గ్రంథమువోలె చదువరుల కింపు పుట్టించునదై, ప్రకృతానవసరములగు వర్ణనలచే సంబద్ధముగాక, యేతాదృశాంగ్లభాషా గ్రంథములవోలె చరిత్రాంశమును, నీతిని, భాషావైదుష్యమును, రచనాచమత్కృతిని వెల్లడించి, నూతనముగ నాంధ్ర వాఙ్మయమునందుఁ జరిత్ర సారస్వతసంకలనమునఁ బాఠకుల కాహ్లాదజనకమై యున్నదనుట యతిశయోక్తి కానేరదు.

కావున నీ గ్రంథకర్త రచించిన బక్సారుయుద్ధమను గ్రంథమువోలె చరిత్రాత్మకమును, రాజనీత్యుద్బోధకము నై సరసవచోధోరణిని వెలుఁగొందు నేతద్గ్రంథముకూడ నున్నత పాఠశాలలయందు బఠనీయగ్రంథముగా నుండఁదగి యున్నది. ఆంగ్లభాషాగ్రంథసరణిని నాంధ్రభాషయందును నిట్టి చక్కని గ్రంథములను రచించి యాంధ్రసారస్వతసేవ నొనరింప గ్రంథ నిర్ణాయిక సంఘమువారును, ఆంధ్రవిశ్వకళాపరిషదధికారులును నీ గ్రంథకర్తను బ్రోత్సహింతురుగాక యని నా హృదయ పూర్వకాభిమతమును వెల్లడించుచున్నాను.

బొబ్బిలి
9—2—1934

రావికంటి సీతారామచంద్రరావు

**Dedication**

TO

**My father-in-law**

*M. R. Ry. Rao Bahadur*

Satyavada Suryanarayana Prasada Row

Pantulu Garu,

Retired Dy. Collector,

**WALTAIR.**

# ఔ రం గ జే బు పా దు షా

జగద్విఖ్యాతిగాంచిన మొగలాయీ పాదుషాలలో నౌరంగజేబు కడపటివాఁడు. బేబరు తత్సామ్రాజ్యస్థాపన మొనరించి (1526), యశోవంతుఁ డయ్యెను. ఆతని పుత్రుఁ డగు హుమయూను ప్రతిభాశాలియగు షర్షాచే నోటువడి, పారసీకదేశమునకుఁ బలాయన మొనరించి, తన యవసాన కాలమున గత రాజ్యసంపాదన మొనరింపఁజాలెను. ఆతని తనయుఁడగు నక్బరు పదమూఁడేండ్ల ప్రాయముననే రాజ్య భారము వహించి, కష్టపరంపరల కోహటింపక తన రాజత్వము స్థిరపఱచికొని, సామ్రాజ్యమత్యంతముఁ బెంపుచేసి, రాజనీతి విశారదుఁడై హైందవ ప్రజాభిమానముఁ జూఱకొని, నిర్వక్ర మగు కీర్తిగాంచెను. రాజపుత్రనారీగర్భసంభవుఁడగు జహాంగీరు తన జనకుని వలె ఘనకార్యము లొనరింపక, నిజభామినీ భుజబంధితుఁడై సుఖంబుగఁ గాలహరణ మొనరించెను. ఆతని కుమారుఁడగు షాజహాను సామ్రాజ్యవిస్తారకుఁడై, యపూర్వభోగభాగ్య సమన్వితుఁడై, కళాపోషకుఁడై, జగదద్భుతభవన నిర్మాతయై తనరి, తుదకుఁ దనపుత్రుని కతంబుననే రాజ్యస్వాతంత్ర్యములుఁ గోల్పోయి, మరణించెను. ఆతని పుత్రుఁడే యౌరంగజేబు.

షాజహానుసార్వభౌముని తృతీయపుత్రుఁడగు నౌరంగజేబు నిక్కముగ నద్వితీయుఁడు. ఆతఁడు జీవించినంతకాల

మే పాదుషాయును జీవింపలేదు. ఆతని ధైర్యస్థైర్యము లద్వితీయములు: బుద్ధివైభవ మసాధారణము; ఉపాయబల మనంతము; గర్వరహిత నిరాడంబరజీవనము నిరుపమానము. అట్టి మహనీయుఁడు కఠినుఁడై, నిరంకుశుఁడై, హైందవ ప్రజా కంటకుఁడై, సామ్రాజ్యవిజృంభణ కార్యైకపరుఁడై, నిరంతర సంగ్రామనిమగ్నుఁడై, సర్వజనాభిమానదూరుఁడై మరణించెను. (1707). ఆనృపాలుఁ డెవ్వరిని విశ్వసింపక, సామ్రాజ్యమంతయుఁ దానే నిరంకుశముగ శాసింపుచు, ప్రజాహిత సంస్కారార్థమై చూపఁదగు బుద్ధివైభవమును, అద్వితీయ కార్యదీక్షను నన్యథా వినియోగించి, పలుదేశములు స్వాయముగా జయించియుఁ దుదకుఁ దన జీవితము వ్యర్థమాయెననియుఁ దాను మరణించునంతనే తన మహాసామ్రాజ్యము శిలాఘటిత మృద్ఘటమువలెఁ దుత్తునియ లగుననియు నవసానమున గుర్తించి, విలపించి, విశీర్ణహృదయుఁడై మరణించెను.

ఔరంగజేబు స్వీయరాజ్య విధ్వంసకుఁ డగుటయేగాక, ఆసేతుసీతాచల వ్యాప్తమగు బ్రిటిషుసామ్రాజ్యము సుస్థాపిత మగుటకుఁ గూడఁ గారణభూతుఁ డయ్యెను. తాదృశమహా ద్విషయ గర్భితమగు నీసమ్రాట్టు చరిత్ర మవశ్యపఠనీయము. మొదట నీతని రాజప్రతినిధిత్వ మరయుదము.

ఔరంగజేబు యొక్క రాజప్రతినిధిత్వము కడుంగడు ముఖ్యము. ఆతని సామ్రాజ్యధౌరేయు నొనరింపఁ జాలిన దయ్యెదే. అతని జ్యేష్ఠసోదరులగు దారా షూజాలును, కనిష్ఠుఁ

డగు మురాదునుగూడ రాజప్రతినిధులై, విశాల సామ్రాజ్య భాగములను పాలించి యుండిరి. కాని, ముందు విశదమగు కారణములచే వారి యనుభవము నిరర్థకమయ్యెను. ఔరంగ జేబు మాత్రము తన యనుభవమును సార్థకపఱచికొని, రాజ్యము వీరభోజ్యమను సూత్రమును స్థిరపఱచెను.

ఔరంగజేబు బాల్యము గుఱించి విశదముగఁ దెలి యదు. ఉజ్జయినీనగరమున కనతిదూరమున నున్న 'దోహాదు' గ్రామమునం దాతఁడు జన్మించెను (24-10-1618). ఆసమయ మున షాజహాను అహమ్మదునగరముపై దండెత్తిన జహాంగీరు పరివారమునందు సకుటుంబముగ నుండెను. తదనంతరము, జహాంగీరు నొక బొమ్మవలె నాడింపఁజాలిన నూర్జహానునకు వెఱచి షాజహాను దేశదేశములకుఁ బరుగెత్తెను. ఆతఁ డెన్ని కష్టములకుఁ బాల్పడినను దన భార్యాపుత్రుల నెడబాయ లేదు. షాజహాను తుదకు లోఁబడి తనకుమారులను, దారా యౌరంగజేబులను నూర్జహానుచెంతకుఁ దన ప్రతిభులుగఁ బంప వలసిన వాఁడయ్యెను. ఔరంగజే బపు డెనిమిదేండ్ల బాలుఁడు. షాజహాను సింహాసనాసీనుఁడగువఱకు (సుమారు రెండు సంవత్స రములు) వారు తలిదండ్రుల నెడబాసి యచటనే యుండిరి.

## అ ద్భు త ప రా క్ర మ ము

ఔరంగజేబు మహావీరుఁడగునని పదునాలుగేండ్లప్రాయ ముననే వ్యక్తమయ్యెను. పాదుషా యగు షాజహాను వినో

దార్థ మొకనాఁడు యమునా నదీతీరమున మదగజములను బోరాడించెను. గజరాజములు వెనుకకొకింత తగ్గి నడగొండల వలె డీకొనెను. పాదుషా తద్వినోదవిలోకనాభిరతుఁడై యా వంకకు వెడలెను. రాజకుమారులు—దారా, షూజా, ఔరంగ జేబు లశ్వారూఢులై ముందు నడిచిరి. ఔరంగజే బమితో త్సాహియై యా మహాసత్వములను మఱియు సమీపించెను. సాయుధులగు యోధజనులందఱుఁ గొంతదవ్వున నిలిచియుం డిరి. తలపడిన మత్తేభములు వీడి వెనుకకు మఱల, నందొకటి యాకస్మికముగ ఘీంకార మొనరింపుచుఁ గరాళమృత్యుదేవత వలె నౌరంగజేబుపై ఱివ్వునఁ బఱతెంచెను. పదునాలుగేండ్ల బాలుఁడయ్యు, నా రాజకుమారుఁ డొకనగమువలె నిలిచి, దానిపై నొకశూలము విసరెను. జనులా భీషణదృశ్యము గాంచి, సంక్షోభించి, పరస్పరపదఘట్టనం బొనరింపుచుఁ బరు గిడిరి. చెలరేఁగిన మదేభమును బెదరించి రాజనందనున కపా యము వారయకుండ మఱలింపవలయునని భటులు ప్రయ త్నించిరి. మత్తగజ మంతమాత్రమున మెత్తవడక, కట్టెదుటం గల వారువమునుఁ దనపెనుగేలఁ జఱచెను. ఔరంగజేబు మెఱపు వలెఁ బుడమి కుఱికి, ఖడ్గము దూసి, ఆ యతికాయమున కభి ముఖుఁ డయ్యెను. కాని, యట్టి పరాక్రమము వలనఁ బ్రయో జన మేమి? అంతలో సహాయు లరుదెంచిరి. అతనికంటె రెండు సంవత్సరములు పెద్దయగు షూజా జనసందోహములను జీల్చు కొనివచ్చి, తన శూలఘాతమున నా మదగజమును నొవ్వఁ

జేసెను. కాని, యశ్వమంతలోఁ బెదర, నతఁడు భూపతనుఁ డయ్యెను. అంతట జయసింహమహారా జేతెంచి యేనుఁగును గారింపఁగడఁగెను. సాయుధులగు సైనికులుగూడ రయమున వచ్చిరి. అంత నాద్విరదము మేఘసన్నిభముగ గర్జించి యట నుండి పాఱిపోయెను. షాజహాను తన తనయుని మనమలర నాలింగన మొనరించి, యతని ధైర్యస్థైర్యములు గొనియాడి, 'బహదూరు' (వీరుఁడు) అను బిరుదమును, పెక్కు బహుమా నములను నొసంగెను.

## బుందేలాయుద్ధము

ఔరంగజేబు కీర్తిమంతుఁడగునని నాఁడే తెల్లమయ్యెను. దుష్కరమగు దక్కనుదేశ పరిపాలనమున కాతనిఁ దయారు చేయవలయునని పాదుషా యోచించి, యుద్ధానుభవ మల వడఁజేయుటకు బుందేలా యుద్ధమునందు సేనాధ్యక్షునిగ నియమించెను. ఔరంగజే బా సమరమున నొనరించిన దేమియు లేదు. ఆరితేఱిన సేనానులే తత్కార్యభారము వహించిరి.

బుందేలులు గహార్వారుశాఖకుఁ జెందిన రసపుత్రులు. బుందేలా భూపాలుఁడగు వీరసింహదేవుఁడు జహాంగీరు నియో గమున నక్బరు సార్వభౌమునకుఁ బ్రాణప్రియుఁడగు నబుల్ ఫజలును వధించి, జహాంగీరు రాజ్యాయాధుఁడై నంతనే యుచ్ఛ స్థితి గాంచెను. వాని యనంతరము బుందేలు ఖండమును బాలించిన ఝుఝూరసింహుఁడు షాజహాను సెలవు గొనకుండ

రాజధాని వీడి, పాదుషా యాగ్రహమునకుఁ బాత్రుఁడయ్యెను. వాని నడంచుటకే యౌరంగజేబు యుద్ధసన్నద్ధుఁడయ్యెను.

మొగలులకు దేవిసింగు నామధేయుఁడగు బుందేలా రాజ్యనాయకుఁడు తోడ్పడెను. కారణమేమన, బుందేలారాజ్య మసలు దేవీసింహునకే రావలసి యుండెను. తద్రాజ్యమునకు వీరసింహునికంటె నాతఁడే సన్నిహితవారసుఁడు. కాని, నాఁటి పాదుషా యగు జహంగీరు నిజమిత్రవిరచిత దౌర్మార్గ్యమునకుఁ గృతజ్ఞుఁడై బుందేలా రాజ్యమునం దాతనిఁ బ్రతిష్ఠించెను. ఆ కారణమునఁ గ్రోధానలతప్తుఁడై యుండిన దేవీసింహుఁ డీసమయమున మొగలులకుఁ దోడ్పడుట సహజము.

బుందేలా యుద్ధము శీఘ్రముగ ముగిసెను. బలవంతులగు మొగలుసేనానులు పాదుషా యధికారముం ధిక్కరించిన ఝుఝూరసింహునిఁ దఱిమి తఱిమి వధించి, యాతని రాణివాసమునుబట్టి మొగలాయీ బీగము మహలునకుఁ గొంపోయిరి. పరపురుషదర్శనముకంటె మరణమునే ప్రీతికరముగ నాకాంక్షించు క్షత్రియమానినీమణులు దుస్సహంపు మ్లేచ్ఛమత మవలంబించి, ప్రేమశూన్యులగు పురుషులకుఁ జిక్కి, నీచతమ జీవన మొనరింపవలసినవారైరి.* అల్పవయస్కులగు బుందేలా రాజకుమారులు మహమ్మదీయదీక్ష గొనవలసివచ్చెను. తన మతము విసర్జింపనొల్లని యొక కుమారుఁడు తత్క్షణము వధింపఁ బడెను. తన ప్రియతనయుఁ డాహ్వానించుటచేత షాజహాను

* cf. J. N. Sarkar's Aurangazebe, Vol. I, p. 27.

బుందేలా రాజధాని కరుదెంచి, తన మతాభిమానము వ్యక్తమగునట్లు దేవళంబులను గొట్టించి, కొన్నిటిని మసీదులుగ సంస్కరించెను: అన్ని యొనరించినను గించిదభిమానమెఱుంగక యుద్ధారంభము నుండియు నిజదేశవిధ్వంసమునకుఁ దోడ్పడిన దేవీసింగున కారాజ్యమొసఁగి, లెక్కలేని ధనకనక వాహనంబులం గొని యతఁడు హాయిగఁ దనరాజధానికి మఱలెను.

## రాజప్రతినిధిత్వము

ఔరంగజేబు రాజప్రతినిధిత్వము 1636 నందుఁ బ్రారంభమాయెను. అతఁడు రెండుసారులు దక్కనునందును, ఆ నడుమ గుజరాతు, బాకు (హిందూదేశమునఁ కవ్వల మధ్యాసియా యందలి యొకదేశము) ముల్తాను దేశములందును, మొత్త మిరువదిరెండు సంవత్సరములు ప్రతినిధిగ నుండెను. మూర్ధాభిషిక్తులగు భూమీశు లంతకాలము రాజ్యపాలన మొనరించుటయే సాధారణముగ దుర్ఘటము. ఇందు దక్కనునందలి రెండవప్రాతినిధ్యము ముఖ్యతమము. తద్విషయము విపులముగఁ బ్రసంగించుటకు ముం దితరవిషయములను లఘువుగఁ బరామర్శింతము.

ఔరంగజేబు పదునెనిమిదేండ్ల ప్రాయముననే దక్కను దేశమునకుఁ బ్రతినిధి యయ్యెను. ఈ ప్రాతినిధ్య మెనిమిది సంవత్సరముల కాలముండెను. తదుద్యోగభారము వహించిన యొక సంవత్సరమునకే యాతని వివాహ మధికవైభవముగ

జరిగెను. అహమ్మదునగరరాజ్యమును బూర్తిగ స్వాధీన పఱచుకొనుట తప్ప ప్రశంసనీయమగు విషయ మెద్దియు నీ కాలమున సంభవముకాలేదు. అల్పభూనాధుల నొంచి యాతఁడు కప్పములను, గానుకలను గొనుచుండెను. బుందేలా యుద్ధసమయముననే యౌరంగజేబు దశసహస్రసైన్యమున కధి నాథుఁ డాయెను. ఇయ్యది గౌరవప్రదమగు పదవి. ప్రతినిధి యైన మఱుసటి సంవత్సరమే యాతని పదవి పంద్రెండు వేలకుఁ బెంపుచేయఁబడెను. మఱి రెండు సంవత్సరములలో నాతఁడు పదునైదువేల సైన్యమున కధీశుఁ డాయెను. అపారశక్తి సామర్థ్యములు గల యౌరంగజేబు తన జనకుఁడగు పాదుషా యభిమానమునకుఁ బాత్రుఁడై దినదిన ప్రవర్ధమాన గౌరవ సంకలితుఁ డగుచుండెను. కాని, అట్టివాఁ డేలొకో, యాక స్మికముగా రాజానుగ్రహముఁ గోల్పోయి పదచ్యుతుఁడాయెను. ఆతఁడు విరాగియై యుద్యోగత్యాగ మొనరించెనని కొందఱు భావింతురు. అటుగాక, యుద్యోగమునుండి పాదుషా తనుఁ దొలఁగించునని యెఱింగియే యతఁ డా పదవిందొఱంగెనని మఱికొందఱు తలంతురు. కాని, ఇట్టికారణము లసమంజస ములు. జ్యేష్ఠపుత్రుఁడును, సదా తండ్రిచెంగటనే యుండువాఁ డును నగు దారా యసూయాపరుఁడై, యౌరంగజేబుపై వాత్సల్యము వహించియున్న షాజహానుయొక్క మనసు విఱిచె ననుట విశ్వసనీయముగఁ, గాన్పించును. ఏమైనను, ఔరంగ జేబు 1644 లో నుద్యోగరహితుఁ డాయెను.

ఆ సమయమున నాతఁడు రాజధానియందే యుండెను. ఔరంగజేబట కే తేరవలసిన యవసరము విచారింపఁదగును. పాదుషా జ్యేష్ఠపుత్రికయగు జహనారా చిరస్మరణీయురాలు. ఈమె పితృభక్తి నిక్కముగ నాదర్శప్రాయము. 'తాజమహాలు' నామధేయ యగు తనజనని జీవనముఁ బాసిన దాదినీ కన్నియ పితృసేవాపరాయణయై యాతని కొక లోపము రానీయక సర్వవిధముల నరయఁదొడఁగెను. తుదకు నా హతభాగ్యుఁడు సువర్ణపంజరాంతర శుకరాజమువలెఁ దన యంతిపురంబునఁ గుందవలసిన సమయమునఁగూడ నాతని వీడక, యా దయాస్వరూపిణి తన వృద్ధజనకుని కష్టములందుఁ బాల్గొనెను. ఆయమ పితృభక్తియే గాక, బంధుపోషణము, దీనజనరక్షణముగూడఁ బ్రసిద్ధములు. జహనారా ప్రేమ నిర్వక్రము, సముద్రమువలె ననంతము, కేవలము నిరుపమానము. ఇందుల కొక యుదాహరణ మీయఁదగును. భ్రాతృరుధిరార్ణవమీఁది వృద్ధజనకుని త్రొక్కలు విడిచిన యౌరంగజేబుపైనైన నామె దీర్ఘక్రోధము వహింపక, తాను క్షమించి, తనజనకుని గూడ క్షమింపఁజేసెను.

జహనారా యొకనాఁడు తన మందిరమున కరుదెంచుచుండ, విధివశమున నామె చెఱఁగు దీపమంటుకొనెను. పరిచారికలు చూచుచుండగనే, సుగంధబంధురమగు నామెమేల్దుకూలము భగ్గున మండెను. ఉజ్జ్వలజ్వాలామాలికా పరివృత

యగు తమదేవిని నాలింగన మొనరించి రక్షింపఁగడఁగిన చెలులు బాధ నొందిరేగాని తదుపద్రవము మఱల్పఁజాలక పోయిరి. తగు సాహాయ్య మరుదెంచునప్పటి కా కోమలాంగి వెన్ను, ప్రక్కలు, భుజములును గాలిపోయెను. ఆదుర్వార్త తెలిసినంతనే యౌరంగజేబు సంక్షుభితమనస్కుఁడై నిజసోదరీ సందర్శన మొనరింపఁ రాజధాని కరుదెంచెను. అరుదెంచిన యొక మాసములోపుననే యీతఁడు పదచ్యుతుఁ డాయెను.

జహనారాయవస్థఁ బరికించి యనంతర మౌరంగజేబు చరిత్ర మరయుదము. ప్రసిద్ధులగు రాజవైద్యులు తమ శక్తి కొలఁదిఁ బాటుపడిరి. చక్రవర్తి లెక్కలేని దానధర్మములు చేయించెను. పాదుషా బాష్పజలార్ద్రనయనుఁడై, వినమ్రుఁడై ముకుళితహస్తుఁడై, యనుదినముఁ జాలకాలము మోఁకరించి దైవమును బ్రార్థించెను. కాని, దైవప్రార్థనమును దానధర్మములును, భిషగ్వరుల కౌశలముంగూడ నిరర్థకమాయెను. నాలుగుమాసముల పర్యంత మా హేమగాత్రి మరణదేవతారక బద్ధయై యుండెను. అంతట వైవిద్యాపరిచయ మెఱుంగని బానిసయొకఁడు దైవవశమున నొక లేపనముఁ బ్రయోగింపఁ బాదుషానందన బాగుపడెను. షాజహాను సంతోషమునకు మేరలేదు. తానేగాక సామ్రాజ్యమంతయు నానందమగ్న మగునటు లాతఁ డొక మహోత్సవము సలిపి రాజోద్యోగు లందఱకు బహుమానము లొసంగెను. పేదలు ధర్మములు వడసిరి. మృత్యుంజయ యగు జహనారాకుఁ బదిలక్షలు విలువ

చేయు నపూర్వాభరణములను జనకుఁ డొసంగెను. అన్నిఁటి కంటె మనవ్యాసమునకు సంబంధించు మహాద్విషయ మెద్ది యన, జహనారా భ్రాతృహితాభిలాషిణియై తన జనకు నర్థింపఁ బడచ్యుతుఁడైన యౌరంగజేబునకు మగుడ నుద్యోగ భాగ్యము సగౌరవముగఁ బ్రాప్తించెను.

## బా కు యు ద్ధ ము

ఔరంగజేబు మఱుసటి సంవత్సరము (1645) గుజ రాతు దేశమునకు రాజప్రతినిధిగ నియోగింపఁబడెను. ఆతఁ డట నుండినది రెండు సంవత్సరములే యైనను, రాజశాసన మెఱుంగక మెఱకులై యుండు నాప్రజాళిని నొక్కి, పరిపా లనాదక్షుఁడని ఖ్యాతిగాంచెను. షాజహాను సంతుష్టాంతరం గుఁడై యాతని వేతనము విరివిగ హెచ్చించుటయే గాక, కష్టతరమగు 'బాకు' యుద్ధమున కాతని నాయకు నొనరిం చెను (1647). బాకు దేశము భరతఖండమున కవ్వల మధ్యాసియాయం దున్నదని వెనుకఁ జెప్పియుంటిమి. ఆ దండ యాత్ర పాదుషా యేల తలపెట్టెనో స్పష్టముగఁ దెలియదు. మొగలాయీ రాష్ట్రమగు నాఘనుస్థానమున కుత్తరమున నున్న యీదేశము సారవంతమైనది కాదు. దేశమునందలి చాలభాగము పర్వతమయమై, దారిద్ర్యనిలయమైఁ యల్ప జనావాసమై, యనాకర్షణీయమై, హేయముగ నుండెను. కాని, అయ్యది ప్రథమ మొగలాయీ సార్వభౌముఁడగు

జేబరునకుఁ జెందియుండెను. అదియొక కారణము గా నోపును. లేదా, కేవలము జిగీషయే కావలయును. ఏమైనను, అది యొక యున్మాదప్రయత్నమని పర్యవసానమునఁ దెల్లమయ్యెను. తనయం దావంతయు లోపము లేకుండ యౌరంగజేబు సమర కార్యము శ్లాఘాపాత్రముగ నిర్వర్తించెను. ఆతనికి మాత్రమే తగు మేటిగాంభీర్య మొకయెడఁ బ్రదర్శించి యౌరంగజేబు శాత్రవనృపాలుని సహితము బ్రమాన్పడఁజేసెను. యుద్ధ మతి తీక్ష్ణముగ నుండెను; ఇరుబలంబులును హోరాహోరి పోరాడు చుండెను. అంతలో సాయంసమయ ప్రార్థనావసర మరు దెంచెను: తన యుద్యోగులు భయవిహ్వాలురై వలదు వలదని హెచ్చరించినను వినక, తనుత్రాణరహితుఁడగు నావీరుఁడు యేనుఁగు డిగ్గి, తివాచిఁ బఱచి, మోకరించి, ఘోరతరయుద్ధ మదెచ్చటనో జరుగుచుండినట్లు, నిశ్చలచిత్తుఁడై, దైవచింతా మగ్నుఁడై, తదనుష్ఠానము యథావిధంబున నొనరించెను! వైరు లా విపరీతదృశ్యము గాంచి హాహాకారము లొనరించిరి. అట్టి వ్యక్తితోఁడఁ బోరాడుట యాత్మవినాశకరమని తత్సేనా ధవుఁడు యుద్ధ మాఁపుచేయించెను. కాని యీ రణము వలనఁ హైందవప్రభుత్వమునకు నాలుగుకోట్ల రూపాయలు ఖర్చాయెను; ప్రతిఫలము మాత్రము శూన్యము. రణరంగ మున నైదువందల మందియును, మంచునకుఁ దాళఁజాలక యైదువేల మందియును మరణించిరి. మనదేశపుఁ బశ్చిమో

త్తర పరగణాలు దాఁటి యన్యదేశాక్రమణ మొనరింప గడంగు సామ్రాజ్యతత్త్వ మిట్టులే దారుణముగ సంకటపడును. *

## కాందహారు ముట్టడి

బాకు యుద్ధానంతర మౌరంగజేబు ముల్తాను దేశము నకుఁ బాలకుఁడాయెను (1648). మఱునటి సంవత్సరము సింధుదేశముగూడ నాతనిచేతికి వచ్చెను. వన్యమృగముల వలెఁ జరించు నచ్చటి 'యాఫ్గను' 'బెలూచీ' జాతులను లోఁబఱచుకొనుట కష్టతమము. ఔరంగజేబు తగు కాఠిన్యము వహించి కొంతవఱకుఁ గృతకృత్యుఁ డాయెను. దేశమునందలి వర్తక మభివృద్ధిపఱుప నెంచి, సింధునదీముఖమున నాతఁ డొక నౌకాశ్రయము నిర్మించెను. ఈప్రతినిధిత్వము నాలుగు వత్సరము లున్నను, రెండుసారు లాతఁడు దేశము వీడి కాందహారును ముట్టడింపఁవలసినవాఁ డగుటచేత నా పరిపాలనము రాణించుట కవకాశము లేకుండెను. ఒక్క సంగతి తలంపవల యును. తనకు వచ్చు వేతనమును ఇతర రాఁబడులను ఇతరుల వలె నాతఁడు నిక్షేపింపక యధికతర సైన్యవ్యయమునకు విని యోగించెను. కాని యిందువలన నొక నష్టము వాటిల్లెను. ఒకపు డాతఁడు ధనము చాలక తన జనకు నర్థింప, నాతఁడు

---

* "Such is the terrible price which aggressive Imperialism makes India pay for wars across the north-western frontier."

J. N. Sarkar.

కుపితుఁడై విముఖుఁ డాయెను. ఐనను, షాజహా నాతని చాక చక్యము లెఱింగినవాఁ డగుటచేత, 'కాందహారు' ముట్టడి కాతనినే నియోగించెను.

కాందహారు దుర్గమును మొగలులు మూఁడుసారులు ముట్టడించిరి. రెండుసారు లౌరంగజేబును, మూడవసారి యువరాజగు దారాయును సేనాధిపత్యము వహించిరి. ఇట్టి బృహత్ప్రయత్నము లొనరింపవలసిన యవసర మొదవించిన కాందహారు సంపాదన మత్యంతావశ్యకమై యుండవలయును. పెరసియా యాఫ్గనుస్థాన దేశముల కయ్యది నడుమ నున్నది. ఆదుర్గము తన యధీనమున నున్నఁగాని యాఫ్గనుస్థానమునకు క్షేమము లేదు. మఱియుఁ బెరసియా దేశమునుండియు, మధ్యాసియా దేశములనుండియు హిందూదేశముపై దండెత్తు భయంకరవైరులు కాందహారు మీఁదుగనే రావలయును. ఆదేశ మాతీరున స్థలప్రాముఖ్యసమన్వితమగుటయే గాక, ప్రసిద్ధవాణిజ్యపథంబై, ధనసమృద్ధమై, సారవంతమై, శోభాయమానమై యెంతయు నాకర్షణీయముగ నుండెను.

షాజహాను రాజ్యారూఢుఁ డగునపుడు కాందహారు పారశీకహస్తగతమై యుండెను. కాని, ఆదేశముఁ బాలించు పారసీకసేనాని యేలాకో, తనఱేనిఁ దలంచి భీతిల్లి, తద పాయవిమోచనమున కొక్కటియే యుపాయమని యెంచి, తన యధీనమున నున్న దుర్గమును మొగలుల కప్పగించెను (1638). షాజహాను పరమానందభరితుఁడై వాని కత్యు

న్నతపదవి యొసంగి విశేషముగ గౌరవించెను. అసలే కడు దృఢమగు నాదుర్గమును బాదుషా యింకను దృఢపఱిచి యభేద్యముగ నొనరించెను. కాని, పోయిన దుర్గము మగుడ సంపాదింపవలయునని పారసీకులు సంకల్పించి, సముచితసన్నాహము లొనరించుకొని, 1648 లో నా వంక బయల్వెడలిరి. వారి ప్రయత్నముల గుఱించి షాజహానునకు ముందుగనే తెలియవచ్చెను. ఐన నాతఁడు మందబుద్ధియై దుర్గరక్షణార్థము వలయు సైన్యములు సకాలమునఁ బంపకపోయెను. అసమర్థుఁడగు నా దుర్గపాలకుఁడు వైరిచమూనివహములఁగాంచి భయభ్రాంతుఁడై, యొక్క లక్షసైన్యమునైనను దృణీకరింపఁజాలు నామేటికోటను వైరుల కప్పగించెను. అట్టి ఘోరము సంభవించునని ఔరంగజే బెఱుంగఁడు. తమ దుర్గమును ముట్టడించిన శత్రువులను జెక్కాడుటకు మాత్రమే యాతఁ డాయత్తపడి యరుదెంచెను. శాత్రవాధీనమైన తదుత్తమ దుర్గమును ముట్టడించుటకు వలయు శతఘ్ను లాతనివద్ద లేవు. కావున, నావీరుఁడు భగ్నమనోరథుఁడై వెనుదిరుగవలసినవాఁ డాయెను.

కాని, శత్రుసంహార మొనరించి యాదుర్గము స్వాధీనపఱచుకొనినఁ గాని తన గౌరవము పునఃప్రతిష్ఠితము కానేరదని యెంచి, షాజహాను భూరితరప్రయత్నము లొనరించెను. అనంతర మాతఁ డౌరంగజేబు నొక్కనినే గాక, తనప్రధానమంత్రియగు సాదుల్లాఖానునుగూడ సేనాధ్యక్షునిగ నియమించెను. మొగలాయీ సైన్యము లనంత బలసమన్వితములై,

దృఢశతఘ్నీదళసహాయ్యములై, విజయోత్సాహములై, దురాసదదుర్గాక్రమణాయత్తములై మగుడ దాడివెడలెను. కాని, విజయ మీసారియును జేకూరకపోయెను. ఔరంగజేబుమాత్ర మందులకు బాధ్యుఁడు గాఁడు. ఆతని తోడిసేనాధ్యక్షుఁడగు ఖానుఁడే సర్వసేనాధిపతియై యుండెను. పాదుషా యాతనినే విశ్వసించెను. అతని యనుమతి లేకుండ యౌరంగజే బేమి చేయుటకును అవకాశము లేకుండెను. ఆతఁడైనను స్వచ్ఛందముగఁ జరింపజాలక, కాబూలునందు విడిసియుండిన పాదుషా యాజ్ఞల కెదురుచూడవలసినవాఁ డాయెను. మఱియు, పారసీకుల రణకౌశలము శ్రేష్ఠము. మొగలాయీ శతఘ్నీదళము నందుఁ బాశ్చాత్యులుగూడ నున్నను, అయ్యవి శాత్రవశతఘ్నులముందు నీరసముగ నుండెను. ఇట్టి కారణములచేతఁ గాందహారుదుర్గాక్రమణము మొగలుల కసాధ్యమయ్యెను. మఱునటి సంవత్సరము యువరాజగు దారా సగర్వముగ సర్వసేనానాయకత్వము వహించి, తన జనకుఁడు సంతోషించునట్లు మహత్తరసైన్యసమన్వితుఁడై బయలుదేఱి, తుదకు గతగర్వుఁడై వెనుదిరిగెను.

లాభ మణుమాత్రము లేని యీమూఁడు దాడులకును బండ్రెండుకోట్ల రూప్యములు ఖర్చాయెను. కాని, ప్రజాభిప్రాయ మరయక కేవలము నిరంకుశముగఁ జరించు ప్రభుత్వ మేమి యొనరించినను జెల్లునుగదా.

మొగలాయీ ప్రతిష్ఠ భగ్నమయ్యెను. షాజహాను నిష్కారణముగ నౌరంగజేబుపైఁ గోపించి, మగుడ నాతని దక్కను దేశపాలనమునకు నియోగించెను.

## 2 గోలకొండ దండయాత్ర

దక్కనునందలి యౌరంగజేబు రెండవ ప్రతినిధిత్వము కడు ముఖ్యము. ఆతని నఖండసామ్రాజ్యధౌరేయు నొనరింపఁ జాలిన దయ్యేదియె. కాని, 'కాందహారు' ముట్టడియందు దురదృష్టవశమున నోటువడి పితృదయాభిమానత్యక్తుఁ డైన యీ పాదుషాపుత్రుఁడు కడు నిడుమలుఁ బడవలసి వచ్చెను. ఆర్థికదురవస్థయు, నంతకంటె నిశితతరమగు జనకుని నిరసనమును ఆతని నెంతేని కారించెను. ఐనను, మహావీరుఁడగు నౌరంగజేబు స్వీయరాష్ట్రాభ్యుదయమునకును, సామ్రాజ్యక్షేమమునకును, స్వీయలాభము కొఱకును అవిచ్ఛిన్నముగఁ బాటుపడి, తుదకు సామ్రాజ్యాభిషిక్తుఁడు కాఁగలిగెను. ఔరంగజేబు భ్రాతృపితృరాజద్రోహము లొనరించిన నొనరించుఁ గాక. ఆతని యపారధీశక్తియు, గార్యదీక్షయు, సమయోపాయ ధురీణతయును సమగ్రవిమర్శకులనైన దిగ్భ్రమచేతస్కుల నొనరించును. ఔరంగజేబు మహాగుణదోషము లీకాలముననే బహిర్గతములాయెను. తాదృశవిషయసంకీర్ణమగు రెండవ రాజప్రతినిధిత్వము పరిశీలనార్హము.

నిరంతరాయము లగు యుద్ధమువలన మొగలాయీ దక్కనురాష్ట్రము పేదవడి యుండెను. మఱియు నౌరంగజేబు ప్రథమ ప్రాతినిధ్యానంతరము తదుద్యోగభారము వహించిన వార లొక్కొక్కఁ డొక విధమున నాదేశమును నికృష్టపఱచిరి. ఒకఁడు కఠినుఁడై, ప్రజను హింసించెను. ఇంకొకఁడు కేవల స్వార్థపరుఁడై, ప్రజా ప్రభువుల నిర్వ్యరను గనుబ్రాఖి యశేష ధనార్జన మొనరించెను. మఱియొకఁ డసమర్థుఁ డయ్యెను. కొండొక కాలము ప్రతినిధిగనుండిన మురాదు—పాదుషా నాల్గవ పుత్రుఁడు — అసమర్థుడగుటయేగాక, సమర్థుఁడగు 'షానావాజుఖాను' ని హితము గైకొనక యాతనిపై ద్వేషిపూర్తిగ నుపేక్షించెను. ఇట్టి ప్రతినిధుల వాతఁబడిన దక్కను దేశము యథాశక్తి సామ్రాజ్యకోశమును బూరించుటకు మాఱుగ నష్టకరముగఁ బరిణమించెను. మూడుకోట్ల యిరువది లక్షలరాఁబడి జూపవలసిన యాదేశ మౌరంగజే బేతెంచునరికి కోటిరూపాయ లొసఁగుటయే కష్టముగ నుండెను.

పరిపాలనాదక్షుఁడగు నౌరంగజేబు నాఁడు ప్రబలి యున్న దోషములను దొలగింపవలయునని సంకల్పించెను. ఆరాష్ట్రమున కరుదెంచిన దాది యాతఁ డాకార్యమున నిమగ్నుఁ డాయెను. సైన్యస్థితి యతిహీనముగ నుండెను. అంతవఱకుఁ దగిన యధికారము లేకుండుటచేత, సైన్యములు శిక్షారహితములై వృద్ధజనసంకీర్ణములై, దుర్బలములై, నిరర్థకములై యుండెను. ఔరంగజేబు సముచితాధికారిని నియో

గించి తొలుదొల్త సైన్యవ్యవస్థ సంస్కరించెను. కుత్సింభరులను దొలఁగించి, సమర్థులగు నుద్యోగులను నియమించి, ప్రభుత్వపటుత్వము నెలకొల్పెను. సత్పరిపాలనములేమి సుక్షేత్రము లూషరక్షేత్రములై యుండెను. కొన్ని భూములు దశాంశము మాత్రము ఫలింపఁ దొడఁగెను. ఔరంగజేబు దివానగు 'మూర్షదుఖూలీఖాను' విశ్వసనీయులగు సమీనాది శుల్కగ్రహణాధికారుల నేర్పఱచి, క్షేత్రములను జక్కఁగఁ గొల్పించి, వలయు ధనసహాయ్య మొసంగుచు వ్యవసాయదారులను ప్రోత్సహించి, దేశమును సుభిక్షమొనరింపఁ గడఁగెను. ఈయెడ నౌరంగజేబు చూపిన పరిశ్రమ శ్లాఘనీయమని చరిత్రకారులు వ్రాయుదురు.

దేశము పాడువడుట సులభము. బాగునడుట కష్టము. వ్యవసాయ పునరుద్ధరణము మాటలతో నగునది కాదు. షాజహానువంటి యనుభవజ్ఞుఁడాపాటి యెఱింగి యుండవలయును. కాని ఔరంగజేబుపై నారంభముననే కుపితుఁడై యుండుటచేతను, స్వార్థపరులు కొంద ఱాతనిపైఁ గొండెములు పల్కుటచేతను, ఆతని యేపునైఁపని దారాయొక్క కుతంత్రములచేతను గూడఁ గావలయు, షాజహా నుచితానుచితవివేచనారహితుఁడై, పరిపాలనోద్ధరణ కార్యైకపరుఁడై యుండిన యౌరంగజేబు ననేకవిధముల నిరసించి కెలఁచెను.

జనకుఁ డెంత నిరసించినను, ఔరంగజేబు నిజవంశక్రమానుగతమగు రాజనీతి మఱవలేదు. ఆతఁ డరుదెంచిన

దాది గోలుకొండ భాగ్యాపహారణముఁ దలపెట్టెను. కుతుబుషా యని పేరొందిన గోలుకొండ సుల్తాను తొల్లి మొగలులచే నోటువడి షాజహానునకుఁ గప్పము చెల్లించుట కొడఁబడెను. కృష్ణా కావేరీనదీ మధ్యస్థమగు కర్ణాటదేశమునందలి చాల భాగము మాత్రమేకాక, ఆసుల్తానుఁ డొరిస్సావఱకుఁ గల దేశముగూడ జయించి, శ్రీకాకుళమునందుఁ దన ఫౌజుదారుని నిలుపఁజాలెను. జగత్ప్రసిద్ధిగాంచిన 'డామస్కసు' ఖడ్గములకు గోలుకొండ దేశమునందలి గనులే లోహ మిచ్చుచుండెను. ఇఁక నత్యద్భుతములగు గోలుకొండ వజ్రపు గనులు ప్రపంచ విఖ్యాతములు. భరతాశియా ఖండములకు మాత్రముగాక, యపరార్థగోళమునకుఁ గూడ హైదరాబాదు నగరముఁ గేంద్రమై సమస్తదేశవణిగ్వరనిలయమై, యనంతభాగ్య భూయిష్ఠమై తనరుచుండెను. చిత్రవర్ణాంచిత వస్త్ర పరి శ్రమకుఁ దావలమై పాదుషాలను పాశ్చాత్య ప్రభువులను గూడ వెఱఁగుపఱచిన మన మచిలీపట్టణము గోలుకొండ రాజ్యముననే యుండెను. నదీ తటాకాది జలసమృద్ధమై, మనోహర శ్యామల సస్యప్రపూర్ణమై, వజ్రఖని నిలయమై, యఖండభాగ్యముతోఁ గలకలలాడు గోలుకొండ రాజ్య మౌరంగజేబునకు నయనకంటకముగ నుండెను. ఆశేని నెట్టు లైనను భంగపఱచి తద్భూరిభాగ్యాపహారణ మొనరింపవలయు నని యాతఁడు తలపెట్టెను. పాదుషా సార్వభౌమత్వమున కొడఁబడిన కుతుబుషా రక్షణీయుఁడగు గాని దండ్యుఁడు

గాఁడు. కాని, యౌరంగజేబు న్యాయాన్యాయములు దలంపక, వాని విధ్వంసమున కొఁక నెపము మాత్ర మరయుచుండెను. చిత్తము కార్యాయత్తమగునపుడు వ్యాజము సులువుగాఁ జిక్కఁగదా. ఔరంగజేబునకు మీరుజుమ్లా యను గోలుకొండ మంత్రి తత్సమయానుకూలముగఁ జిక్కెను.

## మీ ర్జు మ్లా

మీరుజుమ్లాయుదంత మద్భుతము. ఈతని తండ్రి పారశీక దేశమునందుఁ దైలవర్తకుఁడు. రాజపూజితుఁడు గావలసిన 'మీరు' తన దేశమున నికృష్టజీవన మొనరింప నొల్లక, యౌవనమునే గోలుకొండ దేశమున కరుదెంచి, వజ్రవ్యాపార మొనరించి భాగ్యవంతుఁడై, స్వీయప్రతిభావిశేషమున నృపాలదృష్టి నాకర్షించి, యమాత్యుఁడయ్యెను. వ్యాపారమునందు మాత్రమేకాక పరిపాలనయందును రణవ్యాపారమునందుగూడ నా సచివుఁ డసమానుఁడని పేర్వడసి, గోలుకొండ రాజ్యాధికారముం దన యధీన మొనరించుకొనెను. సుల్తానగు 'నబ్దుల్లా' కాతఁడు సర్వమునై యుండెను. రాజానుమతంబున నా మంత్రి కర్ణాటదేశముపై దాడివెడలెను. రణకుశలుఁడగు 'మీరు' పాశ్చాత్య ఫిరంగీకారులనుఁ జేరదీసి హైందవ దేవాలయాంతర పవిత్ర తామ్రవిగ్రహములనుగూడ కరఁగించి ఫిరంగులొనరించి, సైన్యమును లెస్సగ వృద్ధిపఱచి జైత్రయాత్రకుఁ గడంగెను. కర్ణాటదేశాధిపతియగు శ్రీరంగ

రాయలు నైరినివారింప నేరకపోయెను. మీర్జుమ్లా యచిర కాలమునఁ బదునైదువేల మైళ్ళ నైశాల్యముగల దేశమును స్వాధీనపఱచుకొనఁ జాలెను. రాజ్యసంపాదనమే గాక, తన యధీనమునయున్న వజ్రపుగనులను శ్రద్ధమెయిఁ బనిచేయించి యా మూలమునఁ గూడ నాతఁ డమిత ధనార్జన మొనరించి దక్షిణ హిందూదేశ ప్రజాళిలో నెల్ల నత్యంతభాగ్యవంతుఁ డాయెను. నలుబదిలక్షల రాఁబడిగల విశాలదేశమును, అనంత ధనరాశిని, నలుఁబదివేల ప్రబల చతురంగబలమును గలిగి యుద్దండుఁడై యుండిన మానిసి యన్యజనవిధేయుఁడై యెటు లుండగలఁడు ?

గోలుకొండసుల్తానుఁ డాతని వైఖరి గమనించి భయా గ్రహాపరుఁడై, యసమర్థుఁడై, మాయోపాయ మాలోచించెను. మీర్జుమ్లాను దన రాజధానికి రావించి యాకస్మిక ముగఁ బట్టి యాతని నంధు నొనరింపవలయునని సుల్తాను యోచించెను. మంత్రి యీమోసమెట్టులో కనిపట్టి, రాజ ధాని కరుదెంచియు సుల్తానునకుఁ గానరాకుండ పలాయన మొనరించెను. కాని సుల్తానును ధిక్కరించి యాతఁ డన్య సాహాయ్య విరహితముగ మనఁజూచుట యవివేకము. ఆ కారణమున మీర్జుమ్లా బీజాపురసుల్తాను నెయ్య మపే క్షించెను. ఆదిల్షానామధేయుఁడగు నానృపాలుఁడు సంతు ష్టాంతరంగుఁడై సగౌరవముగా నాయమాత్యశేఖరు నాహ్వా నించెను. కాని, మీర్జుమ్లా యా సుల్తానును సేవింపనొల్లక, యాతని తరఫున దక్షిణ కర్ణాటకదేశమును బాలించు నిఖిల

సుఖానుతోడ మంతన మొనరించి తన సాహాయ్యమున నాతఁడును దనవలె స్వతంత్రరాజ్యము గడింపఁగల నాశను రగులఁగొల్పి, యాపాలకుని స్నేహము సంపాదించెను. మఱియు శ్రీరంగరాయల నిఁక బాధింపనని చెప్పి యాతని సఖ్యము గూడ నపేక్షించెను. అనే కోపాయాన్వేషియగు మీర్జుమ్లా యంతమాత్రమునఁ దనివి నొందక, తాను నిక్షేపించిన యనంత ధనరాశిం గొని తనమాతృభూమియగు పెరసియా దేశమునకుఁ బాఱిపోవుటకుఁ గూడ నిగూఢతర ప్రయత్నము లొనరించెను.

సమర్థ తంత్రజ్ఞుఁడగు మీర్జుమ్లా మొగలులకుఁ గూడ వాంఛనీయుఁ డయ్యెను. గోలుకొండరాజ్య విధ్వంసము దల పెట్టిన యౌరంగజేబున కాతని సాహాయ్య మవసరమై యుండెను. గోలుకొండ సుల్తానువలన వానికెట్టి యపాయము గలుగ కుండ నభయమిచ్చి, మొగలాయీ సామ్రాజ్యమున నున్నతోద్యోగమిప్పింతునని యాసపెట్టి షాజహాను కుమారుఁడాతని నాహ్వానించెను. గోలుకొండసుల్తానుడీచెయ్దములు గనిపట్టి, తన యమాత్యుని మగుడఁ బరిగ్రహించుట కెంతయుఁ దత్తఱ పడెను. మీర్జుమ్లా నిక్కముగ ధన్యతముఁడు గదా! తన కేఁడొక వంకను, బిజాపురాధీశుఁ డొకవంకను, అఖండ భూమండలవ్యాప్తం బగు మొగలాయీ ప్రభుత్వ మొకవంకను నాతనికొఱకు నిరీక్షింపు చుండిరి!

షాజహాఁనునకు విజ్ఞాపనమంపియు, మీర్జుమ్లా ద్వైధీభావము విడునకుండెను. పాదుషా ప్రసాదించునది తృప్తికర

ముగ లేకపోవుట చేతనో, కొంత యాలసించినచో నధికతర లాభము చేకూఱునని యోచించిరో, తన భాగ్యము ప్రోవు చేసికొనుట కొక సంవత్సరము వ్యవధి కావలయునని చెప్పి, తద నంతరము వారి సేవకుఁడ నగుదునని బాసచేసి, యాలోనఁ దనసుల్తాను వలనఁ బ్రమాదము రాకుండ తత్సమాచారము రహస్యముగ నుంచవలయునని యాతఁడు కోరెను. కాని, ధీశాలియగు నౌరంగజే బాతని చిత్తము గుర్తింపకపోలేదు. గోలుకొండ బిజాపూరు సుల్తానులవలనఁ దన కపాయము రానంతవఱకు నామమాత్రమై తన్ను సరకుగొనక స్వరాజ్యసౌఖ్య మనుభవింపఁ గడంగునని యెఱిఁగి, సార్వభౌమ కుమారుఁ డుపేక్షాపరుఁ డయ్యెను. అనంత మాతంత్రజ్ఞుని ప్రవర్తనము సుల్తానుల కిర్వురకును దెల్లమయ్యెను. తమ రిరువురను మోస పుచ్చిన టక్కరీని భంజించుటకు తమకు నవశ్యకర్తవ్యమని వారు సక్రోధముగ నిశ్చయించిరి. తానిఁక నిలుచుట యసాధ్యమగుటచేత మీర్జుమ్లా తత్క్షణ మౌరంగజేబు సాహాయ్య మర్థించెను. అతఁడా మంత్రి కొఱ కెదురు చూచువాఁడయ్యు, సుల్తానులు దండెత్తువఱకు వేచి యుండినచో నాతఁడు పూర్తిగఁ దన యధీనుఁ డగునని యౌదాసీన్యము వహించెను.

గోలుకొండ రాజ్యవిధ్వంసనోత్సాహి యగు నౌరంగ జేబున కాలోపుననే తదుచితావకాశ మాకస్మికముగఁ జిక్కెను. మీర్జుమ్లా దారాపుత్రాది కుటుంబము గోలుకొండ యందే యుండెను. ఆతని పుత్రుఁడగు మహమ్మదు అమీను

తన జనకుని ప్రతినిధిగ వ్యవహరించుచుండెను. అతఁడు పితృ భాగ్యవైభవ సంస్మరణముచేఁ గన్నుగానక సుల్తానును దృణీక రింపఁదొడఁగెను. వాని దుష్ప్రవర్తన మనుదిన మధికమగు చుండెను. వాఁడొకనాఁడు తప్పద్రావి, మైమఱచి, సోలుచుఁ దూలుచు సభాగారము జొచ్చి, రాజాసనముపై వ్రాలి, యందు వమన మొనరించెను. సుల్తానీకఁ బట్టఁజాలక, వానిని సకు టుంబముగఁ జెఱయందుఁ ద్రోయించెను (21-11-1655). సమయనిరీక్షణ మొనరించుచుండిన యౌరంగజేబది యే యొక మహాపరాధముగఁ బురస్కరించుకొని యుద్ధసన్నద్ధుఁడయ్యెను.

రాజప్రతినిధియగు నౌరంగజేబు స్వతంత్రుఁడు కాఁడు. సామ్రాజ్యాధీశుఁడగు షాజహాను సమ్మతించినఁగాని యాతఁడు యుద్ధము చేయఁజాలఁడు. పాదుషా సమ్మతి యెట్లైనఁ గాంచవలయును. కాని, మకుటధారణ మొనరించిన సుల్తా నును కేవల మక్రమముగ నడంచుటకు షాజహాను సమ్మతిం పఁడు. కావున, కృతనిశ్చయుఁడైన యౌరంగజేబు కుటి లోపాయమున కుద్యమించెను.

పాదుషాకు విజ్ఞాపనమంపిన మీరుజుమ్లా తత్సేవకుఁడు; వాని పుత్రుని నిర్బంధించిన సుల్తాను పాదుషా యెడ ద్రోహ మొనరించెను; అట్టిద్రోహి తప్పక దండనీయుఁడు :— అని వాదించి, సమరమున కానతీయుమని యౌరంగజేబు షాజహా నును గోరెను. కాని, షాజహానా లోపుననే మీరుజుమ్లాను బంచసహస్రాధిపతిగను, ఆతని తనయుని ద్విసహస్రాధిపతిగను

నియమించి యా సనదులను గూడ నౌరంగజేబున కంపెను. మీరుజుమ్లా సకుటుంబముగ ఢిల్లీనగరమునకుఁ బోవలసియుండెను. ఆతని వారింపరాదనియు, నాతని ధనకనకాదులనుగూడ నిరోధింపరాదనియు సుల్తానున కొకజాబు వ్రాసెను. ఆ లేఖయు నౌరంగ జేబునకే వచ్చెను. తత్క్షణమా జాబు సుల్తానున కంపి, తదాజ్ఞాబద్ధుఁడై యాతఁడు మీర్జుమ్లా కుటుంబధనములను వెంటనే విడువఁడేని, మొగలాయిసైన్యములు వచ్చి పైఁబడు నని రాజప్రతినిధి తెలియఁబఱచెను.

పాదుషా వ్రాసిన జాబు చూచియైనను, ఔరంగజేబు బెదరింపు గమనించియైనను, సుల్తాను మీర్జుమ్లా కుటుంబమును విడిచివైచిన బాగుండెడిది. కాని, తన కంతమాత్రమునఁ బ్రాపించు ప్రమాదము లేదనియో, కేవల జడత్వముచేతనో యాతఁ డటు లొనరింపక పోయెను. మీర్జుమ్లా పుత్రనిర్బంధ వార్త తెలియుటకుఁ బూర్వముగదా పాదుషా వ్రాసెనని యసడ్డ యొనరించెనేమొ. సుల్తాను చిత్త మెట్టులున్నను, విపక్షు సమరప్రయత్నములు రయమ్మునఁ బూర్తియాయెను. అంతలో, మీర్జుమ్లా పుత్రనిర్బంధోదంతము దనకుఁ దెలియ, షాజహా నాతని సకుటుంబముగ విడువవలయునని సుల్తాను నాజ్ఞాపించెను. సుల్తాను తప్పక తదాజ్ఞాబద్ధుఁ డగుననియు, యుద్ధావసరమంత రించుననియుఁ బాదుషా విశ్వసించెను. ఐనను, దన పుత్రుని దృష్టిపఱచుటకై, సుల్తానవిధేయుఁడై చలము వహించునేని, దండెత్త వచ్చునని యాతఁడు వ్రాసెను.

సుల్తాను పాదుషా యాజ్ఞ శిరసావహించునేని, యుద్ధావసరము తొలంగును. కాని, యుద్ధార్థి యగు నౌరంగజేబు దురాశయ మెట్లు ఫలించును ? కాన నాతఁ డాజాబు సుల్తానునకు సకాలమున నందనీయక, పాదుషా యాజ్ఞ నాతఁడు ధిక్కరించెనని నేరారోపణ మొనరించి, తా నాయత్తపఱచిన సైన్యమును హైదరాబాదునగరముపైఁ బంపెను. పాదుషా యాజ్ఞ చేరిన స్వల్పకాలముననే భయంకర రిపుసేనాగమన వార్తగూడ సుల్తాను హృదయము వ్రయ్యలగునట్లు తెలియవచ్చెను. జడుఁడై యుండిన సుల్తాను మిథ్యాస్థైర్యము మంచువలె నంతరించెను. తోడనే, మంత్రిపుత్రుని సకుటుంబముగ నాతఁ డంపివైచెను. తా నెల్లపుడు పాదుషాకు విధేయుఁడనని దీనసందేశము గూడ నంపెను. కాని, తత్పూర్వమే ప్రబలాశ్విక సేనాముఖంబున వాయువేగమున గోలుకొండ రాజ్యప్రవేశ మొనరించి, హైదరాబాదు నగరమున కిరువదినాలుగు మైళ్ల దూరమున విడిసియుండిన యౌరంగజేబు కుమారుడు — మహమ్మదు సుల్తాను నామధేయుఁడు మీరుజుమ్లా భాగ్యము నింకను సుల్తాను నిరోధించెనను నెపమున నాతని వినయ సందేశము నిరసించెను. మొగలాయీ సేనానివహములు ప్రళయ సన్నిభముగఁ దన రాజధానిం డాయునని కుతుబుషా యెన్నఁడుఁ దలంపలేదు. తదపూర్వజవమును, స్వీయవినయ సందేశతిరస్కారమును నిశ్చయముగ నపాయసూచకములని సుల్తానునకు స్ఫురించెను. నగరరక్షణ ప్రయత్నము లొనరించుట

కిఁక నవకాశములేదు. పాప మా మందభాగ్యుఁడు భయ భ్రాం తుఁడై, దారాపుత్రాది బంధుజనసమేతుఁడై, సురక్షితమగు గోలుకొండ దుర్గమునకు రయమ్మునఁబాఱెను (22-1-1656).

కుతుబుషా యట్లు శీఘ్రపలాయన మొనరించుటయే మేలాయెను. ఆతని భీరత్వమే యాతని రక్షించెను. లేదేని, మహమ్మదు కుటిలఖడ్గ ధారావిదళితుఁడై యాతఁడు ముహూర్తమాత్రమున మరణించి యుండును. ఔరంగజేబు మాయావియై దాడివెడలుటయే కాక, అమాయికుఁ డగు సుల్తాను నాకస్మికముగ వధింపవలయునని కూడ యోచించెను. గమనింపుఁడు—"కుతుబుషాభీరుఁడు, నిన్నెదిరింపనేరఁడు: దుర్గముచుట్టును ఫిరంగుల నమర్పుము: అతఁడు గోలుకొండకుఁ బాఱిపోకుండ నప్రమత్తుఁడవై యుండుము: నీవరుదెంచి నన్నాహ్వానింతువని చిరకాలము వేచియుంటిననియు, నీవు రాకుండుటచేత నేనే యరుదెంచితిననియుఁ బల్కుచు నా ప్రమత్తునిఁ జయ్యనఁ బొడిచి పాలియింపుము: స్థైర్యలాఘవకౌశలంబులచే నీకార్యము సులభసాధ్యము."—ఔరంగజేబీవిధమునఁ దన కుమారున కుపదేశించెను. *

హైదరాబాదు నగరమున 17000 సైన్యముండెను. కాని, ఝురీవేగమున నరుదెంచు రిపుసేనా నివహమును నిరోధింపఁ గడఁగుటకు సాహసము చాలక తత్సేనాను లౌరంగజేబు కుమారుని శరణుజొచ్చిరి. వారి ప్రణతు లాతఁడు గ్రహించి,

* cf. J. N. Sarkar, p. 230

పౌరులను బాధింపనని యభయ మిచ్చి, తనసైనికుల నట్టులే యాజ్ఞాపించి, సగర్వముగఁ బురప్రవేశ మొనరించెను. కాని, ప్రపంచవజ్రవ్యాపారమునకుఁ గేంద్రమగు హైదరాబాదు భాగ్యము వర్ణనాతీతము. మొగలాయీసైనికు లాజ్ఞ మఱచి, రెండుదినము లానగరమును నిరాఘాటముగ దోఁచుకొనిరి. సుల్తానగు కుతుబుషా యమూల్యాభరణాదులను గొంపోయి నను, ఆతని యంతఃపురభాగ్య మనంతముగ నుండెను. తన సైనికులరక్షితప్రజాధనాపహరణ మొనరించినపుడు తన పాప మేమనితలంచి కాఁబోలు, మొగలాయీ రాజకుమారుఁడు గూడఁబాల్గొనెను.

స్వీయరక్షణార్థము గోలుకొండకుఁ బాఱిన కుతుబుషా సంధికొఱకుఁ గడుఁ దత్తరపడెను. మీర్జుమ్లా ధనంబు లిచ్చి వైచి, యౌరంగజేబు పుత్రునకుఁ బసదనము లంపుచు, క్షమింపవలయునని యనుదిన మాతఁడు సందేశ మంపుచునే యుండెను. కాని, ప్రయోజనమేమి? కుతుబుషా బీజపుర సుల్తాను సాహాయ్య మపేక్షింపుచు, నభేద్యమగు గోలుకొండ దుర్గమున నప్రమత్తుఁడై యుండెను.

బీజపురసుల్తాను భయంబునఁ గొంతకాలము వేచి యుండిన యౌరంగజేబు తద్భయ మంతరించినంతనే, యతి రయమున గోలుకొండ దుర్గము సమీపించెను. సుల్తాను నిర పాయముగ నటుఁ బాఱివచ్చుటచేత నాతఁ డా దుర్గమును యథాక్రమమున ముట్టడింపవలసినవాఁడాయెను. ఆదుర్గ మొక

వంక దుర్గమారణ్య పరిరక్షితమైన కారణమున, రిపుసైన్యములు మూడువైపుల నప్రమత్తతతోఁ గావలియుండెను. నడి వడి నేతెంచిన మొగలాయీ ఫిరంగులకంటె గోలుకొండ ఫిరంగులు ఘనతరము లగుటచే, నౌరంగజేబు కార్యాతురుఁడయ్యుఁ దన శతఘ్నీదళ మరుదెంచువఱకుఁ దాళవలసినవాఁడయ్యెను. గోలుకొండ సైనికుల లప్పుడపుడు వైరుల నాకస్మికముగఁ దాఁకి, చేయఁగల సంహార మొనరించి, రయమున దుర్గములోనికిఁ బాఱుచుండిరి. ఈముట్టడి యీవిధమున 1655 ఫిబ్రవరి 7 మొదలు మార్చి 30 వఱకు సాగెను.

సుల్తాను సంధిప్రయత్నము మాత్ర ముపేక్షింపలేదు. ఆతని యవిరళోపాయనము లౌరంగజేబున కందుచునే యుండెను. కాని, యాతఁడు సుల్తాను ద్రుణీకరించి, తన తండ్రి యాజ్ఞకొఱ కెదురుచూచుచుండెను. షాజహాను నతఁ డెట్లు ప్రోత్సహించెనో గమనింపఁదగియున్నది.—"తండ్రీ, హైదరాబాదు భాగ్యవైభవ మద్వితీయము: లెక్కకుమిక్కిలిన జలాధారములతోడను, ఎటుచూచినను మరకతములు పఱచినట్లు పచ్చఁగఁ గలకలలాడు విశాలక్షేత్రములతోడను, వెలలేని వజ్రపుగనులతోడను నిండి నిబిడమైయున్న యీ దేశమును వర్ణింపజాలను... ఈ జేఁడు 'షియా' మతస్థుఁడు, నాస్తికుఁడు: మనః మిట్టి నీతిబాహ్యుని శిక్షింపకుండుట యధర్మము...... ఈతఁడు ప్రజాకంటకుఁడు కూడను: ఇట్టి యవకాశముఁ

బోనిచ్చుట యవివేకము''*—పాదుషాకు నీతీరున నాశామతా వేశమును రగులఁగొల్పి, యాతని యనుమతి నడసి, కుతుబు షాను భంజించి రాజ్యచ్యుతు నొనరించి, యా రత్నగర్భము నాక్రమింపవలయునని యౌరంగజేబు నిశ్చయించెను. తన దేశము సుభిక్షమై భాగ్యవంతమై యుండుటచే సుల్తాను చేటుమూఁడుటకుఁ గారణమయ్యెను!

కాని, షాజహాను అంతటి కఠినహృదయుఁడు గాఁడు. నిజకుమారవిరచిత మాయానాటక మింకను నెఱుంగకున్నను, ఒక యల్పనేరము బురస్కరించుకొని మూర్ధాభిషిక్తభూపా లుని రాజ్య మపహరించుట కిచ్ఛగింపక, యుచితపరిహారము వడసి యాతని రాజ్యము విడిచివేయవలయునని పాదుషా తన కుమారు నాజ్ఞాపించెను. కాని, యా జాబు చేరులోపున సుల్తాను స్థితి యింకను విషమ మయ్యెను. ఆతని సైనికులు స్వామిభక్తియు, దేశభక్తియుం దలంపక, శత్రుపక్షమునకుఁ బోవ నారంభించిరి. సుల్తాను భయవిహ్వలుఁడై యెట్టులైన సంధి గావించుకొనవలయునని తత్తరపడెను. మొగలులు బాకీ చూపిన పైకమే గాక, విశేష పరిహార మర్పించుటకును, ఔరంగజేబు కుమారునకుఁ దనకుమారి నొసంగుటకును అతఁడు సంసిద్ధుఁ డాయెను. ఈ రాయబారముఁ దనపై వైచుకొని

* "Not to punish such a heretical ruler would be a failure of duty on the part of an orthodox Islamic Emperor! To miss this opportunity of crushing such an enemy would be highly impolitic." Sarkar—p 236.

యౌరంగజేబును దర్శించి, ప్రార్థించి, సంధి యొనరింపవలయు నని సుల్తాను తల్లియే బయలుదేఱెను. ఇట్టి దైన్యమునకుఁ బాల్పడిన కుతుబుషా షాజహాను వ్రాసిన లేఖాసమాచార మెఱుంగనేని బెట్టుచేయునని యెంచి, యౌరంగజే బావిషయ మును మఱుఁగుపఱచెను. అందులకు షాజహాను సమ్మతించె నట! మహారాజులు చపలచిత్తులుగదా! ఔరంగజే బొక కోటి రూపాయల పరిహారము గోరెను.

కాని, షాజహానున కంతలోఁ దన పుత్రుని కుటిలా వర్తనము పూర్తిగఁ దెల్లమాయెను. కుతుబుషాయొక్క రాయ బారి దారాజహనారాలను ప్రసన్నుల నొనరించుకొని, వారి ముఖమునఁ బాదుషాకు యథార్థము విన్నవించెను. తోడనే రారాజు క్రోధప్రకంపితుఁడై గోలుకొండ ముట్టడి తత్క్షణము చాలింపవలయుననియు, నారాజ్యమునుండి యాక్షణము ససైన్య ముగ వెడలవలయుననియుఁ దన కుమారు నాజ్ఞాపించెను. ఈ యాజ్ఞ రహస్యముగ నుండక సైన్యమున కంతటికి వెల్లడి యగుటచేత, నా యవమాన మౌరంగజేబునకుఁ గడుంగడు దుస్సహమయ్యెను. గోలకొండ దేశాధిపతియగు కుతుబుషా నావరించిన యపాయ మేఘ మాతెఱగునఁ దొలంగెను. ఐనను, సుల్తాను తన పుత్రిక నౌరంగజేబు కుమారున కొసఁ గెను. అధికపరిహార మర్పించుటకుఁ గూడ నాతఁడు సమ్మ తింపవలసినవాఁ డయ్యెను. తద్వారము నొకింత షాజహాను

క్రమముగా తగ్గించెను. కాని, సుల్తాను రామగిరియను జిల్లాను గూడ మొగలుల కర్పింపవలసినవాఁ డయ్యెను.

మన మీ సందర్భమున గమనించవలసిన ముఖ్య విషయమెద్ది యన, నౌరంగజేబునకును దండ్రికినిగల కలఁతలు మితిమీఱెను. గోలుకొండ సుల్తానొసఁగు పరిహారము నందుఁ బాలిత్తునని పాదుషా తొల్లి బాస యొనరించెను. ఆ మాటఁ బాటించి సమరసన్నాహము లొనరించిన యౌరంగజేబు ఋణగ్రస్తుఁడయ్యెను. కాని, యతనిపైఁ గుపితుఁడైన షాజహాను తనపుత్రుఁ డాదాడియందు నమితధనార్జన మొనరించెనని విశ్వసించి తను నాతఁడు వంచించెననియుఁ దలంచి, నిరసించి, కుతుబుషా యొసఁగిన బహుమానములను పరిహారమును దక్షిణము తన కంపవలయునని యాజ్ఞాపించెను. ఇందు నౌరంగజేబు నేరమావంతయులేదు. అతఁ డటు లొనరింపఁ దలఁచియే యుండెను. తన్నిష్ఠురవచోఘాతముల కోర్వఁజాలక, తనునట్టి ఘోరావమానమునకుఁ బాల్సేయుట యన్యాయమని విలపించి, షాజహాను కోరినవానినే గాక, తనకుమారుఁడును దానును గైకొనిన యల్పబహుమానములను గూడ నౌరంగజే బంపివైచెను. తాదృశ బహుళావమానములచే నాతని హృదయము కఠినతరమై తుదకు దయారహిత మయ్యెను. ఆ మహాశూరుఁ డచిరకాలమున భ్రాతృరుధిరార్ద్రశరీరుడై, పితృనిర్బంధకుఁడై, సామ్రాజ్యసింహాసనారోహణ మొనరింపఁ జాలిన పరిస్థితు లెటు లేర్పడెనో యిక నరయవలయును.

# భ్రాతృ సమరము

## 3. ధర్మతు యుద్ధము

భయంకరమగు భ్రాతృసమర మరయుటకు ముందు బీజపుర దండయాత్ర గురించి తెలిసికొనవలయును. ఔరంగ జేబు తత్కార్యనిమగ్నుఁడై యుండినపుడే షాజహాను వ్యాధి గ్రస్తుఁ డయ్యెను. వృద్ధజనకుఁడు దుర్బలుఁడై, రోగపీడితుఁడై, మృతప్రాయుఁ డయ్యెనని తెలియవచ్చినంతనే, షూజా మురాదౌరంగజేబులు సామ్రాజ్య సంపాదనార్థము ప్రచండసన్నాహము లొనరించుకొని, దావాగ్నులవలె రాజధానిం డాయఁ బోయిరి. షూజా ప్రప్రథమము కిరీటధారణ మొనరించి, తన సార్వభౌమత్వము సగర్వముగఁ జాటించెను. ఆవెనుక మురాదమితోత్సాహముతోడఁ దన చక్రవర్తిత్వముఁ బ్రకటించెను. కాని, కార్యశూరుఁడగు నౌరంగజేబట్లు తీవ్రపడక, పరిస్థితులను లెస్సఁగఁ బరిశీలింపుచు, షూజామురాదులతోడఁ గొంత కాలము మంతన మొనరించి, మురాదులతోడి సంబంధము దృఢపఱచుకొని, యదనుదప్పక వైరులను నుఱుమాడి, భ్రాతృకంటకములను దొలఁగించి, నిర్భయముగ మూర్ధాభిషిక్తుఁడయ్యెను.

గోలుకొండ దండయాత్రానంతరము మీర్జుమ్లాకు మొగలాయీ సామ్రాజ్య ప్రధానమంత్రిత్వము లభించెను. ఆలోపుననే మీర్జుమ్లా యౌరంగజేబులు స్నేహబద్ధులైరి. మీర్జుమ్లా 1656 జూలై యేడవతారీకున ఢిల్లీనగరముజేరి, తన

యపూర్వ వజ్రసమర్పణంబునఁ బాదుషాను బ్రసన్ను నొనరించి కొని, తదఖండమంత్రిపదారూఢుఁ డయ్యెను. తన మిత్రుని యున్నతి యౌరంగజేబున కెంతయు ననుకూలించెను.

## బీజపురదండయాత్ర

ఆసమయమున బీజపురసుల్తాను వ్యాధిగ్రస్తుఁ డయ్యెను. అతఁ డచిరకాలమునఁ జచ్చునని యెంచి, యౌరంగజేబు సమరసన్నాహము నొనరించెను. అతఁడు తలంచినట్టులే, సుల్తాను మరణించెను (4-11-1656). తోడనే, యాతని కుమారుఁడగు రెండవ యాదిల్షా తన మంత్రిసాహాయ్యమున సింహాసన మారోహించెను. కాని, యుద్ధప్రియుఁడగు నౌరంగజేబా సుల్తాను క్రొత్తి సుల్తాను కుమారుఁడు కాఁడని వితండవాద మొనరించి, యాదేశముపై దండెత్తుట కనుజ్ఞ యొసఁగవలయునని తత్క్షణము పాదుషాకు వ్రాసి, తన సైన్యముల నాపొలిమేరకుఁ దరలించెను. అతఁ డంతటితో విరమింపలేదు. బీజపురసైనికులు దేశద్రోహులై తనవంకఁ దిరుగున ట్లొనరించెను. తద్రాజ్యమర్మము లెఱింగిన మీర్జుమ్లా సాహాయ్యమునఁ గార్యము సులభసాధ్యమగునని యెంచి యౌరంగజే బాతని నాహ్వానించెను.

ఈ యుద్ధము కేవల మధర్మము. బీజపుర మొక స్వతంత్రరాజ్యము. ఆదేశముపై మొగలుల కెట్టియధికారమును లేదు. తొల్లి షాజహా నాదేశస్వాతంత్ర్య మామోదించు

టయేగాక, తాను జయించిన యహమ్మదు నగర దేశమునందుఁ బాలుగూడ నాసుల్తానున కొసంగెను. అట్టి రాజ్యవారసత్వ సందర్భమున యుద్ధమున కుఱుకుట యన్యాయము. సుల్తాను కుమారుఁడు సుల్తాను కుమారుఁడు కాఁడనుట కేవలము సాహసము. యుద్ధ కారణ మేమన, పూర్వాపరసముద్ర వ్యాప్తంబగు బీజపురరాజ్యము గోలుకొండకంటె ప్రఖ్యాతమై మొగలులకు నయనకంటకముగ నుండెను. వారి యదృష్టవశమున నంతలో సుల్తాను మరణించెను. తదాధిపత్యము వహించిన తత్కుమారుఁడు పదునెనిమిదేండ్ల బాలుఁడు. నూతనముగ జయించిన కర్ణాట దేశమునందలి జమీందారులు బీజపురాధికారమును ధిక్కరించి, తదధికారులను బాఱఁద్రోలిరి. రాజధానియందలి ప్రభువులు మదోన్మత్తులై, పరస్పరకలహనిమగ్నులై, దేశక్షేమంకరుఁడగు ప్రధానమంత్రిని గణింపకుండిరి. దేశమట్లు క్షోభపడి యుండునప్పుడే వారి నడంపవలయునని యౌరంగజేబు నిశ్చయించెను: మీర్జుమ్లా యాశీర్వదించెను: షాజహాను సమ్మతించెను!

అట్టి యధర్మ యుద్ధమున కనుజ్ఞ యొసఁగిన పాదుషా యుపదేశములు గమనింపఁదగి యున్నవి.—బీజపుర దేశమంతయు జయింపవలయును; అంతయు సాధ్యముగాదేని, తొల్లి బీజపురమున కొసఁగిన యహమ్మదునగరరాజ్య విభాగమైన నాక్రమింపవలయును; కోటిన్నర రూపాయల యుద్ధపరిహారము గొని, యారాజ్యము పీడవలయును; ఆసుల్తాను షాజహాను

సార్వభౌమత్వ మంగీకరింపవలయును; ఆ దేశపు నాణెములు షాజహాను నామాంకితములు గావలయును: ఇందు మఱియు వైపరీత్యమెద్దియన, సుల్తాను సుళువుగా సంధి కొడఁబడునేని, మొగలుల భూరిప్రయత్నము లేమికావలయును? కావున నాయూఁపున గోలుకొండపైఁ బడి యాదేశ మాక్రమింప వలయునని షాజహాను హితమొనరించెను! ఆ సులభకార్య మెన్నఁడైనఁ జేయవచ్చునని యెంచి, శూరుఁడగు నౌరంగ జేబు దుస్సాధ్యమగు బీజపురరాజ్యాక్రమణమునకే తలపడెను.

మొగలుల యుద్ధప్రయత్నములు పూర్తియయ్యెను. ఔరంగజేబు రాజధానియగు నౌరంగాబాదునందుఁ గా పుం డుటకు మాళవరాష్ట్రపాలకుఁడగు షయిస్తఖానుఁ డరుదెం చెను. తదనంతరము మీర్జుమ్లా సేనాసమేతుఁడై యేతెంచెను (18-1-1657). ఆతనికొఱకే త త్తరపడుచుండిన యౌరంగజే బానాఁడే సుముహూర్త మరసి సరభసంబుగ బయలుదేఱెను.

రాజధానియగు బీజపురముపై దండెత్తి యాదేశ మంతయు నాక్రమింపవలయునని యౌరంగజేబు నిశ్చయిం చెను. మార్గమధ్యమున నున్న బీదరు కళ్యాణీదుర్గములను ముందు సాధింపవలయు. అయ్యవి సాధారణమైనవి కావు. కాని, యౌరంగజేబు తత్కార్యసాధనోచిత సన్నాహములొన రించియే యుండెను. తమ దుర్గములను ముట్టడించు వైరులను గదిసి, వారి వ్యూహములను భేదించి, తమ కోటల నుద్ధరింప వలయునని బీజపురదేశస్థులు ప్రయత్నించిరి. కాని, కార్య

దక్షుఁడగు నౌరంగజేబు సిద్ధముగ నున్న విశేష సైన్యములను వారిపైఁ బంపి వారి ప్రయత్నములను భగ్నపఱచెను. మొగలాయీసైన్యము లావిధమున శత్రుసైన్యములఁ జెండాడుటయే గాక, యా చుట్టు నందు గ్రామాదులను దోపిడిచేసి, ప్రజానీకములను దెగనఱికి, గృహపంక్తులను గాల్చివైచి, సుక్షేత్రములను మరుభూము లొనరించెను. ఔరంగజేబు తలపెట్టిన ముట్టడి నిరాఘాటముగాఁ గొనసాగెను. సమున్నతతలస్థాపితమై, విశాలపరిఖాత్రయపరిరక్షితమై, యున్నతప్రాకారపరివృతమై, దుర్గమమై, దుర్భేద్యమై యొప్పు బీదరు దుర్గమును నిరువదియేడు దినములలో నౌరంగజేబు సాధింపఁ జాలెను. చరిత్రప్రఖ్యాతమై, బలిష్ఠమై, యుచితసేనాపరిరక్షితమై, బీదరునగరమునకు నలుబదిమైళ్ల దూరమున నున్న కళ్యాణీదుర్గము గూడ నట్టులే మూఁడు మాసములలో మొగలుల యధీన మయ్యెను (1-8-1657).

ఔరంగజేబు కళ్యాణీదుర్గమును ముట్టడించునప్పుడే యాతని కుమారుఁడు విద్యుత్సన్నిభముగఁ బాఱి, యట్టులే యా దేశమును భస్మీభూత మొనరించెను. పాదుషా కుమారుఁడీక ద్విగుణీకృతోత్సాహముతో బయలుదేఱి, బీజపురరాజధాని నాక్రమించి మహావిజయసౌఖ్య మనుభవింపవలయును. కాని, యౌరంగజేబున కంతటి భాగ్యము ప్రాపింపకపోయెను. బీజపురరాజ్య మింకను ముప్పదిసంవత్సరములు వర్ధిల్లవలయునని విధి నిర్దేశించెను. ఔరంగజేబు గాంచు విజయములు యువ

రాజగు దారాకు దుస్సహములయ్యెను. ఔరంగజేబు మిత్రుం డగు మీర్జుమ్లా రాజధానియందు లేకుండుటచేత, పాదుషాను దారా సులభముగా మఱల్పఁగలిగెను. బీజపుర రాయబారులు గూడఁ గృపణులై సంధికోడఁబడవలయునని షాజహాను నర్థించిరి. తోడనే, సంధి యొనరించుకొని వెనుకకు మఱలవలయునని యాతఁ డౌరంగజేబు నాజ్ఞాపించెను. కళ్యాణీ దుర్గాక్రమణము పూర్తికాకపూర్వమే, పాదుషా యాజ్ఞ పిడుగువలె నౌరంగ జేబునకుఁ దెలియవచ్చెను. ఆతఁడు హతాశుఁడయ్యెను.

నాఁడు గోలుకొండ దాడియు, నేఁడు బీజపురదండ యాత్రయు నొక్కవిధముననే పరిణమించెను. సిద్ధాన్నమును గోల్పోయిన హార్యక్షమువలె నౌరంగజేబు దురంతక్రోధ ఘూర్ణితమనస్కుఁడయ్యెను. కళ్యాణి తన యధీనమగువఱకును బాదుషాయాజ్ఞ నాతఁడు రహస్యముగ నుంచెను. తదనంత రము షయిస్తఖాను దక్కను రాజధానియగు నౌరంగాబాదు నగరము వీడి, తన రాష్ట్రమగు మాళవదేశమునకుఁ బ్రయాణ మయ్యెను. ఇతరసామ్రాజ్య సైనికోద్యోగులు గూడ, నౌరంగ జేబు వలదన్నను లెక్కసేయక, తమ రాజధానికిఁ బోఁదొడఁ గిరి. మీర్జుమ్లా మాత్రము నిలిచియుండెను. బీజపురదేశస్థులు గడుసరులు. సంధికొఱకుఁ దత్తరపడిన సుల్తాను కోటిరూపా యలు సమర్పించుటకే గాక, మొగలులు జయించిన కళ్యాణీ దుర్గమును, బెరిందాదుర్గమును, తొల్లి యహమ్మదునగర రాజ్య మునకుఁ జెందియుండిన దేశమును గూడ వారి యధీన మొన

రించుట కియ్యకొనెను. కాని, మొగలాయీసైన్యము పలుచ నగుటఁజూచి, బిగిసి, వారి కర్పించుట కొడఁబడినదుర్గముల నెగవేయఁదలంచి, బీజపురదేశస్థులు కాలహరణ మొనరించిరి. బీజపుర రాజ్యాక్రమణాయత్తచిత్తుఁడగు నౌరంగజేబట్టిదైన్యము నకుఁ బాల్పడియుండిన సమయముననే, పాదుషా వ్యాధిగ్రస్తుఁ డయ్యెనని భయంకరముగఁ దెలియవచ్చెను.

## షా జ హా ను వ్యా ధి

షాజహాను నాకస్మికముగా వ్యాధిపీడితుఁ డయ్యెను. ప్రతిభాశాలులగు భిషగ్వరుల ప్రావీణ్యము వ్యర్థమయ్యెను. ఒక వారము దినములావృద్ధరాజు కడు బాధపడెను. అను దినము దర్శనమొసఁగు సార్వభౌముఁ డగోచరుఁ డగుటచేత, నా మహనీయుఁడు కాలధర్మ మొందెననియే భావించి, పుర జనులు తల్లడిల్లిరి. పౌరులేగాక, పాదుషా ప్రాసాదాంతర జనంబులుగూడ ననుమానగ్రస్తులైరి. అత్యున్నతోద్యోగులు మాత్రము షాజహానును జూడఁ గలిగి యథార్థ మెఱింగి యుండిరి. ప్రజాసంక్షోభ మడంపఁదలఁచి, యతిప్రయాసమున గోర్చి, పాదుషా యొకనాఁడు తన మోము గనఁబఱచెను. సార్వభౌమవదన చంద్రసందర్శనమునఁ బ్రజాసముద్ర ముప్పొంగెను. మృత్యుభయము తొలంగినను, షాజహాను మఱియొక మాసము వఱకుఁ బునర్దర్శన మీయఁజాలక పోయెను. ఆలోపున, పాదుషా మరణించె నను దుర్వార్త సామ్రాజ్యమంతటను

వ్యాపించెను. తోడనే శాంతిసౌఖ్యముల కాలవాలమై యుండిన సామ్రాజ్యము మహోగ్రభ్రాతృసమరముచేఁ బ్రకంపించెను.

బంగాళా దేశమును బాలించు షూజా — పాదుషా రెండవ కుమారుఁడు పితృమరణము ధ్రువమని యెంచి, యమితోత్సాహమున రాజత్వము వహించి, దారాను భంజించుటకు వడివడి సంసిద్ధుఁ డయ్యెను. గుజరాతు రాష్ట్రమును బాలించు మురాదు — పాదుషా నాల్గవకుమారుఁడు గూడ నాలసింపక కిరీటధారణ మొనరించి యుద్ధసన్నద్ధుఁ డయ్యెను. కాని, షూజావలె నాతఁడు తీవ్రపడక, యౌరంగజేబు సాహాయ్య మపేక్షించెను. మురా దౌరంగజేబుల సాహాయ్యము దృఢతమమై, యౌరంగజేబునకు సార్థకముగను, తదాశ్రయునకుఁ బ్రాణసంకటముగను బరిణమించెను.

సుస్థిరసంకల్పధురీణుఁడగు నౌరంగజేబు భయంకర భ్రాతృసమరానల పరీక్షయందుఁ గృతార్థుఁడు గాఁజాలిన యద్భుతచరిత్రక్రమ మరయుటకు మును, దారా యౌరంగజేబుల పరస్పరవైషమ్యమును గ్రహింపవలయును.

## దారాయౌరంగజేబులు

దారా యౌరంగజేబుల చిత్తములు చిన్ననాఁటి నుండియుఁ బరస్పరవిరుద్ధముగనే యుండెను. సుగుణరాశియగు జహానారా తొల్లి యగ్నిజ్వాలాదాహమునఁ గడు బొగులునపు డౌరంగజేబు తత్తరమున నటుఁ బారియుండెను గదా!

తదనంతరము, దారా తన నూతనభవనమును జూపవలయు
నని తన జనకుని, సోదరులను నాహ్వానించెను. దారా త్రోవ
నూప, వారు లోనికిఁ బోయిరి. అందొక మందిరము భూగర్భ
మున నుండెను. ఔరంగజే బొక్కఁడు మాత్ర మందుఁ బ్రవే
శింపక, యేసమాధాన మీయక, ద్వారమున నిలిచిపోయెను.
అట్టి యసంబద్ధవర్తనము పాదుషాకుఁ గూడ దుస్సహ
మయ్యెను. ఔరంగజేబు తద్రహస్యకారణమును జహనారాకుఁ
దెలిపెను. దారా తన భవనమును జూపు నెపమునఁ బితృ
భ్రాతృసంహార మొనరించి తక్షణము చక్రవర్తి కాఁగోరెనని
యనుమానించియే యౌరంగజేబు ద్వారపాలన మొనరించెను.
ఇది యొక గాథయైనను, దారా యౌరంగజేబులకు సఖ్యము
లేదనియు, సఖ్యము లేకుండుటయే గాక, యౌరంగజే బను
మానగ్రస్తుఁడై తన జ్యేష్ఠసోదరు నేవగించెననియు వ్యక్తీక
రింపఁజాలి యున్నది. ఆ సోదరు లొక్కయెడ నుండుట యన
మంజస మనియే పాదుషా యౌరంగజేబులను గుజరాతు పరి
పాలనమునకు నియోగించెను. కాని, వా రెడముగ నున్నను,
ద్వేషబీజము స్థిరావాస మేర్పఱచికొని, మొలకెత్తి, యథే
చ్ఛగ వర్ధిల్లెను. సార్వభౌమపుత్రులలో నెల్ల నౌరంగజేబే
కార్యదక్షుఁడై, మొగలాయీ వంశక్రమానుగతమగు నన్య
రాజ్యగ్రహణ ధర్మమును జయప్రదముగ నిర్వర్తింపఁజాలి
యుండెను. కాని, యాతఁడు గోలుకొండరాజ్యమును బూర్తిగ
వశపఱచికొన నుండిన సమయమున నాదేశపు రాయబారులు

దారాను బ్రసన్ను నొనరించుకొనియే తమ దేశమును దక్కించు కొనిరి. బీజపుర దండయాత్రావసరమునఁ గూడ నట్టి విఘాతమే యౌరంగజేబునకు సంభవమాయెను. తండ్రి చెంతనుండి, తండ్రి యభిమానముఁ జూఱకొని, తండ్రిపంపున నిఁక సామ్రాజ్య సింహాసనాసీనుఁడుగానున్న దారా యౌరంగజేబు ప్రతిపక్షులకు శరణ్యుఁ డాయెను. దక్కను దేశాక్రమణ మవివేకము, ననమంజసము, విశాల రాజనీతికి విరుద్ధము, ఒహు దోషభూయిష్ఠమునని చరిత్రజ్ఞులు గ్రహింతురు. ఆ యవివేక దుష్టప్రయత్న మఖండమొగలాయీ సామ్రాజ్యమును బూడ్చి వేయఁజాలిన మహాకూపముగఁ బరిణమించుటయే గాక, పాశ్చాత్య ప్రభుత్వవిజృంభణకుఁగూడ ననుకూలపడెనని చరిత్రకోవిదు లరయఁగలరు. కావున, దారా తన సోదరుని దుష్టప్రయత్నము ప్రతిఘటింపఁ బూనుట శ్లాఘనీయమే. ఐనను, ఔరంగజేబు దారాకతంబున భగ్నపడి, క్రోధ ఘూర్ణితుఁ డగుట సహజము.

దారా పాదుషా జ్యేష్ఠపుత్రుఁడు. తన యనంతర మాతఁడే పాదుషా కావలయునని షాజహాను వాంఛించెను. తనయభిమత మనేకవిధముల నాతఁడు వ్యక్తపఱచెను. కడు సులభమగు నల్హాబాదు, పంజాబు మొదలగు రాష్ట్రములను పాలించుట కాతఁడు నియోగింపఁబడెను. ఆపాటి పైనను గష్టపడ నవసరము లేకుండ, తద్రాష్ట్రపాలనముం దనప్రతినిధు లకు నీడి, యాతఁడు రాజధానియందే యుండఁజాలెను

దారా యనేక బిరుదములను నపూర్వాధికారమును వడయుచుండెను. తొలుత 40 వేల సైన్యమునకును, పిమ్మట 50 వేలకును, తుదకు 60 వేలకును నధ్యక్షపదము క్రమముగా నాతని కలవడెను. ఆతని సంవత్సర వేతనము రెండుకోట్ల రూపాయలయ్యెను. దారాకుమారు లౌరంగజేబు మొదలగు పాదుషా పుత్రులతోడి సమానాధికారములు గాంచుచుండిరి. పాదుషా పౌత్రులపాటి గౌరవస్వాతంత్ర్యములు తనకు లేకపోయెనే యని యొకసారి యౌరంగజేబు విలపించెను. పాదుషా యాగ్రహమునకుఁ బాత్రులగు సామంతాది ప్రముఖులు దారాను నాశ్రయించుచుండిరి. పాదుషాను సందర్శింప నరుదెంచు నధికారులు రాయబారులు మొదలగు ప్రముఖులు దారానుగూడ దర్శింపవలసి యుండెను.

షాజహాను హృదయము స్పష్టమాయెను. తండ్రియనంతరము తాను సుళువుగాఁ దత్సింహాసన మలంకరింపవచ్చునని దారా విశ్వసించెను. ఔరంగజేబు సమర్థుఁడని యాతఁడెఱుంగకపోలేదు. ఆతఁడు తన యున్నతి సహింపఁడని యెఱుంగకపోలేదు. తనచే ననేకసారులు పరాభూతుఁడైన తమ్ముఁడు, పాదతాడిత భుజంగమువలె నపాయ మొనరింపఁజూచునని యెఱుంగకపోలేదు. ఐనను, పాదుషా సమక్షమునఁ దనయెడ భయభక్తి వినమ్రులై మెలఁగు సామ్రాజ్యోన్నతోద్యోగు లందఱుఁ దన యధీనముననుండ, దలయెత్తి సాహసించు నౌరంగజేబు నడంచుట సులభమని యువరాజు భావించెను.

అత్యున్నతపదారూఢుఁడై, మహాసామ్రాజ్యమంతయుఁ దనదే యని భ్రమించు మానవుఁ డన్యథాయెట్లు తలంపఁగలఁడు? భావిఫలాదర్శ మాతఁడుఁ జూచునేని, సార్వభౌమసన్నిభుఁడు యుద్ధమున నోటువడి, నిలిచిన తావున నిలువనేరక, అన్న పానము లెఱుంగక పలుదేశములు బాఱి, తుదకు హంతకుని చందమునఁ బట్టువడి, తాను సర్వజనవంద్యుఁడై వెలింగిన రాజధానియందే హీనాతిహీనంబుగ నూరేగి, భయంకర దుర్మరణమునకుఁ బాల్పడుట గాంచియుండును. కాని, మానవున కట్టి దివ్యదృష్టియా?

జ్వరపీడితుఁడైన జనకునకు దారా సాభిమానముగ సర్వోపచారములు చేయించెను. షాజహాను కొంచెము సుఖవు గాంచి నంతనే, తన ప్రియపుత్రున కనేక బహుమానము లొసఁగి, ప్రధానాస్థాన సభ్యులను, ప్రధానరాజోద్యోగులను రావించి, దారా తనయనంతర చక్రవర్తియనియుఁ, దానిపుడు జరాజ్వరపీడితుఁ డగుటచేత నాతఁడే రాజకార్యములెల్లఁ జెల్లించుననియు, వారంద ఱాతనిఁ దన్నువలెనే జూచి వినయవిధేయులై యుండవలయుననియుఁ బలికి, నాఁటినుం డియు నాతఁడు దైవచింతన మొనరింపఁగోరెను. దారా యానాఁడే సర్వాధికారధురంధరుఁ డాయెనేని, లేదా, షాజ హానే పరిపాలనభారము వహించియుండెనేని బాగుండెడిది. అట్లుగాక, రాజ్యము ఘోరాపాయ మేఘావృతమైన మహా సంకట సమయమున నిరువురును గలసి శాసింపఁ బూనుటచేత

నేతద్బ్రహ్మనాయకక ఫలిత మిరువురకును దారుణముగ ననుభవ వేద్య మాయెను.

దారా మూర్ఖుఁడు గాఁడు. తన యధికారము నిర్వ హించుకొనుట కనువగు మార్గము లాతఁ డన్వేషించెను. తన మిత్రుల కధికతరాధికారము లొసంగెను. అట్టులే నూతన మిత్రులను గూడ నాతఁడు సంపాదించెను. ఔరంగజేబు మిత్రుఁ డగు మీర్జుమ్లాను మంత్రిపదవినుండి తొలఁగించెను. మాలవదేశ పాలకుఁడగు షయిస్తఖాను గూడ నౌరంగజేబు పక్షపాతి యగుటచేత నాతనిని రాజధానికి రావించెను. కాని, యా ఖాను రాజధానియందుండియే యౌరంగజేబునకు హిత మొనరింపఁ గలిగెను. ఔరంగజేబు పక్షపాతులలో రోషనారా ముఖ్యురాలు. ఔరంగజేబును బోలిన యా పాదుషానందిన తంత్రములు పన్నుచుఁ దన ప్రియ సోదరున కమూల్యసాహాయ్య మొనరించెను. దారా ప్రయ త్నము లావిధమున భగ్నమగుచుండెను.

షాజహాను నవంబరు మాసమధ్యమున రోగవిముక్తుఁ డాయెను. షూజా యాలోపుననే యుద్ధసన్నద్ధుఁడై బయలు దేఱెనని యాతఁ డపు డాలించెను. షాజహాను సమ్మతింప, షూజాను బ్రతిఘటించుటకు దారా యొక మహాసైన్యము నంపెను (30-10-1657). సమర్థుఁ డగు జయసింహ మహా రాజు తత్సేనాధిపత్యము వహించెను. దారా జ్యేష్ఠకుమారుఁ డగు 'సులేమానుషూకో' యును, విశ్వాసపాత్రులగు సమర్థ

సేనాను లనేకులును నందుండిరి. షూజానునోడించి, వారతి రయమున మగిడిరాఁగలరని దారా భావించెను. కాని, అది యొక గొప్ప తప్పిదము. దాన నాతని మూలబలము కృశించెను. సుడిగాలివలె మహాజనంబున కరుదెంచు నౌరంగజేబును మార్కొనినప్పుడాలోపము దారుణముగఁ దెల్లమాయెను.

ఔరంగజేబును వారించుటకు యశవంతసింహుఁడు బయలుదేఱెను. యోధపురాధీశుఁ డగు యశవంతుఁడు యోధాగ్రేసరుఁ డనియు, మహాపరాక్రమవంతుఁ డనియుఁ, బేరుగాంచెను. కాని, యాతఁడు జయసింహునివంటి రాజనీతికోవిదుఁడు కాఁడు. మురాదౌరంగజేబులు జన్మతః యజేయులై యుండిరి. పాదుషా పుత్రులనుఁ దాఁకుటకుఁ బాదుషా పుత్రుఁడే నాయకత్వము వహింపవలయును. అన్యులు తత్కార్యసాధనోచితగౌరవరాహిత్యమున దుర్బలు లగుదురు. ఔరంగజే బసాధారణుఁడు. అతఁడు సార్వభౌమపుత్రుఁడును, మహాశూరుఁడు నగుటయేగాక, యఖండధీమంతుఁడు గూడ నై యుండెను. ఔరంగజేబునకు మురాదు గూడఁ దోడ్పడుటచేత నాతని యాధిక్యము ద్విగుణీకృత మయ్యెను. యశవంతుఁ డన్ననో! కడు విషమావస్థకుఁ బాల్పడెను. పుత్రవత్సలుడగు షాజహాను మురా దౌరంగజేబులు తన యాజ్ఞ మన్నింతురని భ్రమించి, యుద్ధమనివార్య మగువఱకును వేచియుండవలయునని యశవంతు నాజ్ఞాపించెను. ఆ మహారాజు గూడ బేలయై యట్టులే యాసించెను: ఔరంగజేబు నర్మదానదిం

దాటువఱకు నాతని సమరసన్నాహముల నరయఁజాలక ప్రమత్తుఁడై యుండెను. మఱియు, సామ్రాజ్యసైన్యమున కాతఁడే నాయకుఁడైనను, తద్విభాగములన్నింటిని శాసింపఁ జాలక పోయెను. అందలి మహమ్మదీయ సేనావిభాగాధ్యక్షుఁ డగు కాశిముఖాను, తన యధికారము దలంచి, మత్సరించి, రాజభక్తి మఱచిపోయెను. ఔరంగజేబు సైన్య మటుగాక, యేకాజ్ఞాబద్ధమై, యేకాశయబద్ధమై, యజేయముగ నుండెను. అందలి రాజపుత్ర మహారాష్ట్రసైనికులు గూడ స్వామిభక్తి పరాయణులు. అట్టి మహాసైన్యమును శాసించు సేనాని విజయము గాంచుట సహజము.

చతురోపాయధురీణుఁడగు నౌరంగజేబు యుద్ధసన్నద్ధుఁడయ్యు, నా యవసరము లేకుండ కార్యము సాధించుటకుఁ బ్రయత్నించెను. తన జనకుని సందర్శించుటకు మాత్రము బయలుదేఱిన తన్ను వారింపకుండ యశవంతసింహుఁడు తన యోధపురమునకుఁ బోవునేని, తాను యుద్ధావసరము లేకుండ కృతకృత్యుఁడ నగుదునని యౌరంగజే బాతనికిఁ గబురంపెను. పాదుషాకు విధేయుఁ డగు యశవంతుఁడు నిరాకరించెను.

రెండు సైన్యములును ఉజ్జయినీనగరమునకు సమీపముగ నున్న ధర్మతు గ్రామముచెంత విడిసెను. భ్రాతృమహాసంగ్రామమునం దీ ధర్మతు యుద్ధము మొదటిది. తదభివర్ణన మొనరించుటకు ముందు, యశవంతుని స్వభావమును వ్యక్తపఱచు విషయ మొండు గమనింపవలయును. మీర్జుమ్లా

సంపాదించిన శతఘ్నీదళము ప్రశస్తమైనది. ఆ ఫిరంగుల నౌరంగజేబు తన సేనాముఖమున నిలిపియుంచెను. యశవంతున కట్టి మారణయంత్రములు లేవు. ఆకారణమున నాతని యుద్యోగి యొకఁడు చక్కని యుపాయ మాలోచించెను. నిశీథమున నా ఫిరంగి భటులపై నాకస్మికముగాఁ బడి, వారిని సంహరించి, ఆయంత్రముల నాక్రమింతుమని యాతఁడు పలికెను. కాని, పరాక్రమశాలి యగు రసపుత్రయోధున కట్టి యధర్మా చరణము తగదని యశవంతుఁడు తృణీకరించెను.

మఱునాడుసూర్యుఁడుదయించుసరికిసైన్యములు రెండును యుద్ధసన్నద్ధము లయ్యెను. యశవంతుని సైన్యము సుమారు నలుబదివే లుండెను. అందుఁ బదివేల సంఖ్యగల ప్రధానసేన రెండుబాఱులు తీరియుండెను. అం దొకటి కాశిముఖాను క్రింద నుండెను. రెండవది యశవంతుని క్రింద నుండెను. అందలి వామపార్శ్వమును ఇఫ్తిఖారు నామధేయుఁడగు మహమ్మదీయుఁడును, దక్షిణ భాగమును రాయసింహుఁడును బాలించుచుండిరి. మృత్యుభయ మెఱుంగక రిపుసంహార మొనరించు రెండువేల రసపుత్ర రహాతూరులతోడ యశవంతసింహుఁడు మధ్యభాగమున నుండెను. ఇతర సేనావిభాగములు గూడ నుచితస్థలములం దుండెను. కాని, ఈ మహాసైన్యము నిలిచిన ప్రదేశ మిఱుకుగ నికృష్టముగ నుండుటచేత, యుద్ధమునందు సైన్యవిభాగములు సమయానుకూలముగఁ దిరుగుట కవకాశము లేకపోయెను. అపజయమున కదియొక కారణము.

ఔరంగజేబు సైన్యము గూడ సుమారు నలుబదివే లుండెను. అందు, మురాదు సేన పదివేలు. ఔరంగజేబు కుమారుఁ డగు మహమ్మదు సుల్తాను, నజబతుఖానును గలసి తొమ్మిదివేల దండుతోడ ముందుండిరి. కవచపరిరక్షితులగు నా సైనికు లపారయుద్ధానుభవము గలిగియుండిరి. జుల్ఫికారు ఖానుఁ డను సేనాని వారికి రక్షగా ఫిరంగులతోడ ముంగల నుండెను. మూర్షి దుకూలీఖానుఁడు ప్రధాన శతఘ్నిదళమును శాసింపుచుండెను. ఎడమభాగమున ముల్తఫతుఖానును, కుడి భాగమున మురాదును నుండిరి. మధ్యసేనావిభాగము ప్రత్యేక ముగ నౌరంగజేబు నాయకత్వమున నుండెను. వివిధ సేనాంగ ములను రక్షించుటకును, బోషించుటకును గూడ నౌరంగజేబు సముచిత సన్నాహము లొనరించుకొని యుండెను.

యుద్ధ ముదయముననే ( 15 — 4 — 1658 ) ప్రారంభ మయ్యెను. సమర మారంభమునుండియు భీషణముగ నుండెను. శత్రుసైనికులు తుపాకులు గాల్చుచు, బాణవృష్టి గురియిం చుచు సమీపించినంతనే, యశవంతుని రసపుత్రభటులు జల ధరములవలె 'రామ్! రామ్!' యని యఱచుచుఁ దమ తావులు వీడి, ఝరీప్రవాహమువలెఁ బాఱి, తెగఁబడిన వ్యాఘ్రములవలె శతఘ్నిదళమును దాఁకిరి. ఫిరంగులు కొంత సంహార మొనరించినను, ఉన్మాదులవలె వచ్చి పడు శత్రువుల ముందు ఱిత్తవోయెను. తత్ప్రధాన సేనానియగు మూర్షిదు కూలీఖాను వైరినిఁ బ్రశంసనీయముగ నిరోధింపఁ గడఁగి,

నిహతుఁ డయ్యెను. ఆ దళము విచ్చిపాఱెను. జయోత్సాహు లగు రసపుత్రులంత నౌరంగజేబు సైన్యమును దాఁకిరి. సేనాముఖమునఁ గావలియున్న జుల్ఫికారుఖాను భీరుఁడై పరుగిడక, తన యేనుఁగు డిగ్గి, సైనికులను హెచ్చరించి, శ్లాఘనీయముగఁ బోరాడెను. పాప మా శూరుఁడు క్షతగాత్రుఁడై మరణించెను. రసపుత్రులు విజయపరవశులై యౌరంగజేబు సేనానివహమును జీల్చి చెండాడఁ గడంగిరి. ఆ హైందవ సైనికులొక్కని నాయకత్వమునఁ బోరాడిరేని, పిఱుందనున్న సేనావిభాగములు వారినిఁ బోషించెనేని, కాశీముఖాను స్వామిభక్తిపరాయణుఁడై యుదారమనస్కుఁడై తోడ్పడెనేని, యశవంతుఁడు యశోవంతుఁడై యుండెడివాఁడు. దారా యదృష్టము బాగుగనే యుండెడిది.

అనుభవజ్ఞులగు నౌరంగజేబు సైనికులు నిశ్చలముగ నిలిచి పోరాడిరి. విఱిగిన సైన్యము గూడ నంతలో మగుడ నేర్పడి రసపుత్రులను జుట్టివైచెను. వారు ప్రదర్శించిన శౌర్య మత్యద్భుతము. ఐనను, సాహాయ్యములేని కారణమున నాసేన యంతయు ననలాంతర శలభగణంబువలె మ్రగ్గెను.

రసపుత్రఝంఝానిలమునఁ గలంగిన యా సైన్యము నౌరంగజేబు చక్కగ నుద్ధరించెను. పాఱినఫిరంగి భటులు రయమ్మున నరుదెంచి, యశవంతుని సేనావిభాగమును దహింపఁ దొడఁగిరి. అందుఁ గుడిభాగమును శాసించు రాయసింహుఁడు పందవగిది స్వసైన్యముగఁ బలాయన మొనరించెను.

ఔరంగజేబు సోదరుఁడగు మురాదు యశవంతుని శిబిరము నాక్రమించి, శాత్రవవామభాగమును బిడుగువలెఁ దాఁకెను. ఆ విభాగమును బాలించు నిఫ్తిఖారుఖాను ఘనంబుగఁ బోరి తెగటాఱెను. ఈఖాను మరణించుటచేతను, రాయసింహుఁడు పాఱిపోవుటచేతను, యశవంతుని ప్రత్యేకసైన్యము రక్షారహితమై శత్రుమారణమునకుఁ బాల్పడెను. యశవంతసింహుఁడు మార్తాండునివలె దుర్నిరీక్షుముగ నాలుగుగంటలు పోరాడెను. అతని రహతూరు లద్భుతమగు విక్రమముఁ జూపిరి. కాని, యాసేన యత్యల్పము. అయ్యది క్షణక్షణముఁ బలుచనగుచుండెను. యశవంతుఁ డీఁక జయముగొనుట యసంభవము. ఐనను, ఆ మహాపరాక్రమశాలి వెనుజూపనొల్లక, శత్రుసైన్యమునందుఁ జొరఁబడి, కొనయూపిరి నిలుచునంతవఱకును శత్రుసంహార మొనరించి, వీరస్వర్గ మలంకరింపవలయునని వాంఛించెను. కాని, స్వామిభక్తిపరాయణులగు సరదారులు తమ ప్రభుని బలవంతముగ రణావనినుండి తొలగించిరి.

ధర్మతు యుద్ధము ముగిసెను. ఔరంగజేబు ప్రతిష్ఠాగరిష్ఠుఁడై ప్రసిద్ధతరమగు 'సముగరు' యుద్ధమునకు శీఘ్రముగ సిద్ధపడెను.

## సముగరుయుద్ధము

ధర్మతుయుద్ధమునందు జయించిన యౌరంగజేబు బలమధికమయ్యెను. అతని నక్కడనే వారింపకుండుట యపాయకరము. తత్కార్యభారము దానే వహింపవలయునని దారా

గుర్తించెను. అట్లుగాక, వృద్ధుఁడగు షాజహాను తానే సైన్యాధిపత్యము వహించి, నయభయ దండనోపాయములచేత మురాదౌరంగజేబులను వారి రాష్ట్రముల కంపివేయవలయునని యోచించెను. అతఁడటు లాచరించెనేని, దారాకును, దనకును క్షేమకరముగ నుండెడిది. ఔరంగజే బెంతటి బలాఢ్యుఁడైనను, ఎంతటి ధీరుఁడైనను, ఎంతటి యుపాయశాలియైనను, మహాసామ్రాజ్యభార ధురంధరుఁడగు తండ్రియే సేనాముఖంబునఁ దోఁచునపుడు, నిలిచి పోరాడనేరఁడు అతని సేన లాతనిఁ దప్పక విడనాడియుండును. కాని, షాజహాను మంత్రులు వేఱువిధ మాలోచించిరి. పాదుషా యాస్థానసభ్యులు భోగలాలసులై యౌరంగజేబుపక్షపాతులై రణవిముఖులై యుండిరి. ఏకగర్భసంజాతులు యుద్ధ మాచరించుటయే యసంబద్ధమనియు, నందుఁ జనకుఁడు తన కుమారులపైఁ దాడివెడలుట మఱియు ననుచితమనియు వారు నుడివిరి. మురా దౌరంగజేబులాగ్రానగరమున కరుదెంచిన యనంతరమే పాదుషావారు తమ ధూర్తపుత్రులను మందలించి వారి వారిరాష్ట్రములకు మఱల్పవచ్చునని యాసభ్యులు హితమొసఁగిరి. తన యభిమతముగూడ నట్టులే యుండుటచేత, షాజహాను వెంగలియై వారిమాట విశ్వసించెను. దారా కుపితుఁడై వారినిఁ దీవ్రముగ నిరసింప, నాసభ్యులును సేనానులును మఱియు విముఖులైరి. వారి వైరుధ్యము వలనను, సులేమాను జయసింహాదులు షుజాపై దాడివెడలి దవ్వున నుండుటవలనను, దారాకుఁ జాల యనర్థము వాటిల్లెను.

దారా తీవ్రముగ సమర సన్నాహము లొనరించెను. తన కధీనులగు సామంతులను, సైనికోద్యోగులను వారి వారి సేనలతోడఁ దనరాష్ట్రములనుండి రావించెను. తత్సేనలకు వలయు తుపాకులు ఫిరంగులు మొదలగు యుద్ధోపకరణములే గాక ధనముగూడ షాజహాను విరివిగ నొసంగెను. దారా సైన్యమును, రాజధాని యందలివియుఁ గలిసి యఱువదివే లాయెను. సమరసన్నాహములు పూర్తియైన యనంతరము తన జనకునకు సమస్కరించి యాశీర్వాదము వడయుటకు దారా షాజహాను చెంతకుఁ బోయెను. తండ్రి కుమారుల వియోగము వర్ణనాతీతము. తన యాత్మసంజాతుఁడు తనలో లీనమగునట్లు లాతని గాఢాభిమాన పూర్వకముగా దృఢాలింగన మొనరించి పవిత్రధామమగు మక్కావంక మోముద్రిప్పి, యశ్రుధారార్ద్ర నయనుఁడై పాదుషా దీవించెను. తన ప్రియపుత్రుఁడు తన కిఁకఁ గానరాఁడని యాతనికి స్ఫురించెను గాఁబోలు. ఆముసలి ఱేఁడు విషణ్ణహృదయుఁడై చూచుచుండ, నౌరంగజేబును బట్టి తెచ్చువానివలె వైభవముతోఁ సగర్వముగఁ దన యనంతసేనా ముఖంబున దారా యుద్ధమునకు బయలుదేఱెను.

దారా సైన్యవిభాగ మొకటి మే నెల 9 వ తేదీని వెడలెను. 22 తేదీని దారాకూడ ఛాంబలునదీ తీరస్థమగు ధోల్పురముఁజేరి, యౌరంగజేబు సేనావాహిను లావాహినిం దాటిరాకుండ ఘనతరమగుప్రయత్నము లొనరించెను. లోతు నీరులేని పాటిరేవు లన్నింటిని పరికట్టి, మార్గము లన్నింటిని

బంధించుటయే గాక, నదీతీరమున సమున్నతవేదికలు గట్టించి, వైరులను భస్మీభూత మొనరింపఁజాలు శతఘ్నులను వానిపై నెలకొల్పి, యువరాజు ప్రమత్తుఁడై యుండెను. ఆలోపునఁ దన కుమారుఁడు జయసింహాది యోధజన సమన్వితుఁడై యరుదెంచిన వెంటనే సోదరుని మార్కొనవలయునని యాతఁడు తలంచెను. పాప మామందభాగ్యుఁడింకను నౌరంగజేబు ధీశక్తియుఁ గార్యదక్షతయును గుర్తింపఁజాలకపోయెను. అతఁ డప్రమత్తుఁడై నిశ్చలముగ నిబ్బరముగఁ గాచికొని యుండగనే, నలుబదిమైళ్ల దూరమున నౌరంగజే బొక పాటిరేవు గనిపట్టి ససైన్యముగ, సురక్షితముగ నదిదాటెను (23 తేదీ). రేవు లన్నియు దారా కాచెనుగాని, మాఱుమూలనున్న యొక్కటి మాత్ర ముపేక్షించెను. ఔరంగజేబున కదియే యక్కఱకు వచ్చెను. ఆ వార్త తెలిసినంతనే, దారా భయభ్రాంతుఁ డాయెను. నదీతీరమున నాతఁడొనరించిన మహాసన్నాహము లన్నియు వ్యర్థమగుటయేగాక, యాతని సేనాపృష్ఠ మరక్షిత మయ్యెను. దారా యట నిలువనేరక, రయమ్మునఁబాఱి, యాగ్రానగరమున కెనిమిది మైళ్ల దూరమున సముగరుక్షేత్ర మున విడిసెను.

సముగరు క్షేత్రము యమునానది వలయితమై, విశాలమై, ప్రచండమగు భ్రాతృసమరమున కనుకూలముగ నుండెను. దారా యాప్రదేశముఁ జేరినదాది రణమునకు సిద్ధముగనే యుండెను. ఔరంగజేబు సైన్యము 28 వ తేదీని ప్రత్యక్ష

మయ్యెను. యుద్ధసన్నద్ధుఁడై యుండిన దారా తత్క్షణ మా సేనను గదిసినచో బాగుండెడిది. ఔరంగజేబుసైన్యమలసి యుండెను. అయ్యది దారా సేనకంటెఁ దక్కువకూడను. ఈ రెండు కారణములేగాక, యుద్ధాతురంబగు సైన్యమును నిర్హేతుకముగ నాపియుంచుట యవివేకము. దాన, వారి యుత్సాహము చల్లారుటయే గాక, తమ నాయకునిపైఁ గల విశ్వాసము తొలంగును. ఐనను, దారా ప్రమత్తుఁడుగాక, తన సేనలను జక్కగ వ్యూహము దీర్చుకొని యుండెను. ఇసుక మయమగు నామరుభూమియందు భాస్కరుఁ డుగ్రుఁడై యన లము గ్రక్కుచున్నను, అతని సైనికు లాయుధపాణులై తమ నిర్దిష్ట ప్రదేశములందు యథావిధంబున నిలిచియుండిరి. అగ్ని కుండమువంటి యా రణభూమియందుఁ గవచము ధరించిన యోధులబాధ వారికే తెలియవలయును. ఆ యపరాహ్ణామే గాక, రేయియెల్లను గూడ దారాసైన్యమట్టులే యుద్ధమున కాయిత్తమై యుండెను.

అనుభవజ్ఞుఁడగు నౌరంగజేబు సముగరుక్షేత్రముఁ జేరి నంతనే తన సేనలకు విశ్రాంతి యొసఁగెను. తన యుద్యోగులు రాత్రియెల్ల సేనారక్షణ మొనరింపుచుండ, నౌరంగజేబు వారిని హెచ్చరించి, వారి రణోత్సాహమును బెంపుజేసెను.

అరుణోదయము కాకపూర్వమే యౌరంగజేబు సేనా విభాగములు విశ్రమస్థానములు వీడి, తమ నాయకుఁ డేర్పఱి చిన తావులందు నిలిచెను. ఆ సేన యేఁబదివే లుండెను.

సహస్ర సంఖ్యాయుతమగు పురోభాగ మౌరంగజేబు కుమారుఁడగు సుల్తాను మహమ్మదు నధీనమున నుండెను. ఆ రాజకుమారునకు సమర్థుఁడగు నజబతుఖాను బాసటయై యుండెను. జుల్ఫికారు, సాఫ్సిఖానులు శతఘ్నులతోడ నాసేనకు రక్షగా ముంగల నుండిరి. ఇస్లాముఖాను దక్షిణభాగమును శాసింపుచుండెను. ఇందు మహమ్మదీయులేగాక, ఇంద్రద్యుమ్నుఁడు చంపతరావు బుందేలుఁడు, హాదా భగవంతసింహుఁడు మొదలగు రసపుత్ర సేనానులుగూడ నుండిరి. మురాదు తన పదివేల సైన్యముతోడ నెడమనుండెను. ఆయా విభాగములను సమయానుకూలముగఁ బోషించుటకు షేకుమీరు అనువాఁడైదువేల యుత్తమసైన్యముతోడ సిద్ధముగ నుండెను. తన్మహాసేనామధ్యమునఁ గొండవంటి మదగజం బారోహించి యౌరంగజేబు విశాలరణక్షేత్రమును బరిశీలింపుచుండెను. బహాదూరుఖాను, ఖానీదురానీ యను ప్రసిద్ధసేనాను లాతని పక్షముల కధినాథులై యుండిరి. దృఢమగు నినుప కవచమును, ఇనుపముంగ్లును, తొండమునఁ బ్రచండాయుధములును దాల్చిన సమున్నత మత్తేభము లుచితప్రదేశములందు భయంకరముగ నిలిచి యుండెను.

ఔరంగజేబు సైన్యముతోఁబాటు దారా సైన్యముగూడఁ గ్రమముగ బాఱులుగట్టి యుద్ధమున కాయిత్తమయ్యెను. సేనాముఖంబున దీర్ఘముగ శతఘ్నిదళమును, ఆ వెనుక తుపాకిదళమును నుండెను! చిన్న మరపిరంగు లైదువందల యుష్ట్ర

ముల మీఁద నాపియుంచ నుండెను. ఆ వెనుక గజయూధమును, అశ్వికదళమును, కాల్బలమును క్రమముగా నమరియుండెను. దారా రసపుత్రులనే విశ్వసించెను. హాదా, శశోదియా, రహ తూరు గౌరుశాఖల రసపుత్రులు సేనాముఖమున నుండిరి. నిరుపమాన ధైర్యస్థైర్యసమన్వితుఁడై, మహమ్మదీయులకుఁ గూడ నాదర్శప్రాయుఁడైన ఛత్రసాలుఁడు—బూందీరాజు— ఆ విభాగమును బాలించుచుండెను. విశ్వసనీయుఁడగు దిలేరు ఖాను 4000 ఆఫ్ఘనులతోడను, 3000 ఉత్తమాశ్వికదళము తోడ నాస్కరుఖానును గూడ ముందేయుండిరి. ఈ విభాగ ములు సునిశితఖడ్గధారవలె రిపుచమూనివహమును ఛేదించు ననియు, తక్కుంగల సైన్యముతోడ తా నావిచ్ఛిన్న సేనానివ హమును జెండి విజయముగాంతుననియు దారా విశ్వసించెను. ఆ యోధులు భయకాపట్యము లెఱుంగని సేవకులగుటచేత, దారా యంతనిర్భయముగ నుండెను. ఆతని ద్వితీయకుమా రుఁడును, యశస్చంద్రుఁడైన మహావీరుఁడు రుస్తుముఖానును వామభాగమును శాసించుచుండిరి. దక్షిణవిభాగము కాలీ లుల్లాఖానుని పాలనమున నుండెను. ఈఖానుఁడు పాదుషా యన్నముఁ దినితిని కడుమాననీయుఁడై వృద్ధుఁడయ్యెను. అట్టి సేవకుఁడు యుద్ధమున స్వామిహితము మఱచి యన్యథా చరించుట శోచనీయము. సేనాముఖముననున్న విభాగము వెనుకఁ బదివేల సైన్యముండెను. అయ్యది యావిభాగమునకే గాక, పార్శ్వములకుఁ గూడ సమయానుకూలముగఁ దోడ్ప

డుట కేర్పడియుండెను. తద్విశాలసేనామధ్యమున దారా యొక సమున్నత గజరాజ మారోహించి, రణరంగమును బరిశీలింపుచుండెను. ఆతని క్రిందఁ బ్రత్యేకముగఁ బండ్రెండువేల సైన్య ముండెను.

దారా మహాసంరంభముతోడ ఫిరంగులు ప్రయోగింప, నా యనంత రణక్షేత్రము సాంద్రధూమాక్రాంతమై కంపించెను. ఔరంగజేబు వృథావ్యయ మొనరింపనొల్లక, మర్యాదకు మాత్రము దానును గొన్ని శతఘ్నులు పేల్చెను. తదనంతరము, దారా తన చతురంగబలములతోడ వడివడిఁబోయి రిపుసైన్యమును దాఁకెను.

యుద్ధ మొక్కపెట్టునఁ దీవ్రమై, తీక్ష్ణమై దుర్నిరీక్ష్యమయ్యెను. భానుఁ డుజ్వలముగ వెలుంగుచున్నను, కాఱుమేఘములఁ బోలు ధూమపటలములుఁ గ్రమ్మివేయ, రణావని యంధకారబంధుర మాయెను. దారా వామపార్శ్వాధినాథుఁ డగు మహాయోధుఁడు రుస్తుముఖాను తనసేనఁతోడఁ బాఱి రిపుశతఘ్నుల నాక్రమింపఁగడఁగెను. కాని, యౌరంగజేబు ఫిరంగిదళము ప్రశంసనీయముగఁ దమనేర్పు చూపుటచేత నటుపోజాలక, రుస్తుముఖాను ప్రక్కకు మఱలి, పురోభాగమును మెఱపువలెఁ దాఁకెను. ఔరంగజేబు మధ్యమసేనం బాలించు బహదూరుఖాను తదపాయము గుర్తించి, రయమ్మున నటుఁబోయెను. ఐనను, ఆతనిసేన యల్పమగుటచేత, నావీరుఁడు క్షతగాత్రుఁడై నేలఁబడెను. ఆతని సేనాను లిర్వురు

తెగటారిరి. ఇఁక నాహతశేషులు పాఱవలసినదే. అట్టి సంకట సమయమున నిస్లాముఖాను షేకుమీరులు చయ్యన నరుదెంచి శత్రుసంహారమునకుఁ దలపడిరి. అధికతరమగు శత్రుసైన్యమును గాంచియు, రుస్తుము చలింపకపోయెను. తుదకొక తుపాకిగుండాతని హస్తము ఛేదించెను. మరణమిఁక ధ్రువమని యెంచి యామహావీరుఁ డశ్వముపై నుఱికి, తనుఁబోలు పండ్రెండుగురు ధీరులతోడ రిపుసేనాకదంబమును జెండిచెండి వీరస్వర్గముఁ గాంచెను. హతశేషమగు నల్పసేనతోడ దారాకుమారుడు వెనుకకుఁ బాఱెను.

రుస్తుముఖానువలె ఛత్రసాలుఁడుగూడఁ బిడుగువలె శత్రుసైన్యమును దాఁకెను. ఛత్రసాలుఁ డుద్దండసాహసంబున శాత్రవశతఘ్నుల నడుమఁ దనసైన్యముతోడఁ జొరబడి, యౌరంగజేబు నుండి మురాదును వేఱుపఱిచి యాతనిఁ గదిసెను. రసపుత్రుల శౌర్యమద్వితీయము. యుద్ధమొక క్రీడవలె విహరించు నాశూరులు వివాహార్థమరుదెంచు పెండ్లికుమారులపగిది హరితాంబరధారులై, వివిధాలంకారవిరాజమానులై యశ్వారూఢులై, యాత్మరక్షణ చింతావిదూరులై, యత్యుగ్రులై రిపువధ నాచరించిరి. రామసింహ నామధేయుఁడగు రహతూరురాజు తన శిరోవేష్టనమునందలి యాణిముత్యములు తెల్లనికాంతులు పెల్లుగఁబఱప నొక్కత్రుటిలోన మురాదు గజంబును డాసి "దారాసింహాసన మాక్రమించువాఁడవు నీవా" యని నిందింపుచుఁ దనశూల మాతనిపై విసరెను.

కాని వీరుఁడగు మురాదు వాడినారాచము గుఱిచూచి యీ ప్రతాపవంతునిఁ బరిమార్చెను. ఐనను, ఆతని యనుచరులు నిరుత్సాహపడక ఆ యేనుంగును జుట్టి మురాదును గడతేర్పఁ బ్రయత్నించిరి. మురాదు ధైర్యస్థైర్యము లమోఘములగుటచేతనే యాతఁడు మనఁజాలెను. రసపుత్ర బాణము లవిరళముగ నాటుటచ్చేత నాతని యంబారి యేదుపందివలెఁ గాన్పించెనని వర్ణింతురు. రసపుత్రులకు దావూదుఖానుగూడఁ దోడాయెను. మురాదు సేనాను లనేకులు మణించిరి. మావటి మరణించెను. ఆమహాయోధుఁడును క్షతవదనుఁడాయెను.

మురాదు నట్టియవస్థకుఁ బాల్చేసిన రసపుత్రులు భ్రాతృసహాయ్యమునకై యరుదెంచుచుండిన యౌరంగజేబును గూడఁగదిసిరి. యుద్ధ మతిదారుణ మయ్యెను. రసపుత్రుల శౌర్యము చరిత్రప్రసిద్ధము. ఔరంగజేబు సైనికుల ధైర్యస్థైర్యములుగూడఁ బ్రశంసనీయములు. కాని, యుద్ధపరిశ్రాంతులగు రసపుత్రు లోటువడుట స్పష్టము. తా మలసియున్నను, వైరులు చిచ్చువలె గ్రమ్మి దహించివైచుచున్నను, రసపుత్రులు తమప్రాణములఁ దృణీకరించి యౌరంగజేబును జెండవలయుననియే ప్రయత్నించిరి. ఛత్రసాలాది నాయకులు తెగటారిరి. రహాతూరు రాజగు రూపసింహుఁడు మహాసాహసియై తనయశ్వము డిగ్గి, యౌరంగజేబు మదేభము సమీపించి, యాతని భూపతను నొనరింపవలయునని సంకల్పించి, ఆ యంబారి త్రాటిని నఱకఁబోయెను. ఆవ్రేటున నేనుగుకాలు

తెగెను. ఔరంగజేబు సహిత మాశూరుని యతిసాహసమున కలరి, యాతని రక్షింపవలయు ననుచుండగనే యంగరక్షకు లా రసపుత్రసింహమును ఖండించిరి.

రుస్తుము ఛత్రసాలులవలె దారాయును దనతావువీడి యుద్ధమున కుఱికెను. ఔరంగజేబును దాఁకి, విజయము చూఱఁగొనవలయునని యాతఁ డాసించెను. కాని, యుద్ధరంగ మంతటినిఁ గలయఁ జూచుచు సమయానుకూలముగఁ దన సేనావిభాగములను నడిపించి పోషింపవలసిన సర్వసేనాధి నాథుఁడు తదుచితస్థానము వీడి యొక సామాన్యునివలె యుద్ధ మునఁ బోరఁబడుట యవివేకము. మఱియు, తన ఫిరంగుల ముందు తానే యుండుటచేత, శత్రుశతఘ్ను లాతని సేనను దహించుచున్నను, దారా ఫిరంగులు యూరకుండవలసినవా యెను. ఆ యరిష్టము తెల్లమైనంతనే, తన ఫిరంగులను ముందు నకుఁ దేవలయునని యాతఁ డాజ్ఞాపించెను. కాని, తమ్ము శాసించు బల మచట లేమింజేసి, ఫిరంగిభటులు యుద్ధముఁ దలంపక తమ శిబిరములనే దోపిడిచేయుటకుఁ బోయిరి. కొంద ఱున్నను, ఎండవేడిమి కోర్వఁజాలక వృషభములు మర మరణించుటచేత, నా కార్య మసాధ్యమయ్యెను. శాత్రవశతఘ్ను లీలోపున నొక్కసారి యనలవృష్టి గురియించి దారా సేనను మిక్కిలి చీకాకుపఱచెను. యువరా జట నిలువఁజాలక కుడి వైపుఁ దిరిగి షేకుమీరి సేనందాఁకెను. దయ్యములవలెఁబడి మఱుమాడు రుస్తుముఖానాది మహాశూరులను వారించుటకుఁ

దనచెంతనుండు సేనావిభాగముల నంపియుండుటచేత, నా సమయమున నౌరంగజేబ త్యల్పసేనాపరివృతుఁడై యపాయకరమగు స్థితియందుండెను. అట్టి యవసరమున దారా విద్యుద్గతిం బాఱి యాతనిఁగదిసెనేని, యాదార్భాగ్యుఁడు విజయాదిత్యుఁడై వెలింగెడువాఁడు. ఏ కారణముననో గాని యట్టి మహావకాశ మాతఁడు పోనిచ్చెను. అలసి యుండుటచేతను శీఘ్రగమనమున కాప్రదేశ మననుకూలముగ నుండుటచేతను దారా వెడలజాలక పోయెనని మనో కీ్రవాయును. ఏమైనను, పోయిన మహాతరుణము మఁగుడవచ్చుట దుర్లభము. ఔరంగజే బాలోనఁ దనలోటుఁ బూటుచేసుకొనెను. దారా యా తావునుండి ఛత్రసాలునకు సాయపడుట కటుఁబోయెను. తన వామపక్షమునుండి యాతఁడు దక్షిణమునకు బరుగిడెను. అట్టి వ్యర్థప్రయత్నమువలన నాతనిసేన శత్రుశతఘ్నుల కాహుతియై కొంతయు, దుస్సహ సూర్యాతపంబున గొంతయును నాశనమయ్యెను. తమ పురోభాగమున జేరు నప్పటికి మిగిలిన సైనికులు మృత ప్రాయులైరి.

మురాదు యుద్దండమగు పరాక్రమము సూపి, యాత్మ రక్షణ మొనరించుకొనెను. మహాసేనాని యగు నౌరంగజేబు కష్టావసరమునఁ గలవరపడక, స్థిరచిత్తుఁడై సేనారక్షణ మొనరించుకొనెను. దారా పక్షములు, పురోవిభాగమును విచ్ఛిన్నము లయ్యెను. మిగిలిన సేనలు వ్యూహము చెడి యుండెను. ఔరంగజేబుకుమారుఁడగు మహమ్మదుసుల్తానుఁ

డదియే సమయమని కొదమసింగమువలె దారాపైఁబొత్తెను. ఔరంగజేబు దక్షిణవిభాగ మట్టువైరినిఁ జుట్టెను. శతఘ్ని దళమును నిర్భయముగా నటుఁదిరిగెను. దారా యెటులుండెను! తన ప్రసిద్ధసేనానులు పెక్కండ్రు మరణింపఁ సేన తఱుఁగ, ఫిరంగులు నిరర్థకములు కాగ కడుబడలి బలహీనుఁడై యుండెను. అట్టి సమయముననైనను కాలీలుల్లాఖానుఁడు స్వామిభక్తిఁ జూపకపోయెను. మురాదు మీఁది కాతఁడే ముందు దూఁకెను. అయ్యది కేవల మారంభశూరత్వము, కృత్రిమము. అనంతర మానాయకుఁడు యుద్ధమునఁ బాల్గొన లేదు. ఆహా! అట్టి స్వామిద్రోహులు రణమునకు రాకుండు టయే స్వామికి క్షేమకరము గదా. విజయలక్ష్మి సుమా క్రాంతుఁడై రాజధానికిఁ దిరిగిపోదునని విశ్వసించి యుద్ధమున కుఱికిన యువరాజున కిప్పుడు పరాజయము దయ్యమువలె గోచ రించెను. ఐననాతఁడు పందయైపాఱక, ధీరుఁడై తనసైన్యమును హెచ్చరించి యంత్యప్రయత్నమున కాయత్తుఁడయ్యెను. కాని, ఆ యల్పసేనానౌక యవిరళోత్తుంగ రిపుసేనా తరంగ ఘూర్ణిత రణసముద్ర మధ్యమున నెంతకాలము నిలువఁగలదు? రిపుసేనాతరంగము లనుక్షణముఁ బెఱుగుచుండెను. గుఱితప్పక వర్షించు ఫిరంగిగుండ్లచేత దారా సేన శీఘ్రముగ క్షీణించు చుండెను. దారాతో మాటాడు సేనానులు సహితము మాటాడుచునే నేలఁ గూలుచుండిరి. ఐదారు వీసెల భారముగల శతఘ్ని గోళములు దారా చుట్టును దాండవ

మూడుచు బీభత్స మొనరింపఁ దొడంగెను. గజారూఢుఁడైన యువరాజే పగతుర తుపాకిగుండ్లకు గుఱియయ్యెను. భక్త్యభిమాన పూరితులై భయవిహ్వలులై యాతని మిత్రు లాక్రోశింప, యువరాజు చేయునదిలేక యున్నత గజరాజము డిగ్గి యశ్వారూఢుఁ డయ్యెను. ఉతము నాయకుఁ డగోచరుఁ డైనంతనే, హతశేషమగు సైన్య మాత్మరక్షణార్థము పిక్క బలిమిఁగొలఁదిఁ బలాయన మొనరించెను.

తాను నిలిచియుండఁగనే తనసేన విచ్చి పాఱుటగాంచి దారా భ్రమాన్వితుఁడాయెను. అతని కుమారుఁడగు సిఫీర్ షుకోఁ దదాకస్మిక భయంకరపరిణామముఁ జూచి మతిసెడి యేడ్చెను. దారా దట్టికిఁ దూణీరము బంధింపఁబోయిన సేవకుఁడు గుండు దెబ్బతిని యొక్క క్షణము క్రిందటనే మరణించెను. దారా యింకను నటఁ దడయునేని, శాత్రవాధీనుఁడగుట తథ్యమని యెంచి, స్వామిభక్తి పరాయణులాతని యశ్వఖలీనముఁబట్టి యామృత్యురంగమునుండి సపుత్రకముగఁ దొలంగించిరి.

యువరాజు నాలుగైదు మైళ్లు వడివడిఁబాఱి, పరిశ్రాంతుఁడై, యూపిరాడక యొకతరుచ్ఛాయ నాశ్రయించెను. పాదుషా ప్రియపుత్రునకా యిట్టి దురవస్థ? అట్టి హేయంపు విశ్రాంతియైనను లేకపోయెను. శాత్రవమృత్యు ఘంటానినాదములు వెంటనే వీనులఁబడఁగ, దారాయనుచరులు దిగ్గున లేచిరి. కాని, దేహమధిక శ్రమమ్మున దుర్బలమయ్యెను; విపరీత నిరాశావేశమునఁ జిత్తము వికలమయ్యెను: అట్టి

యవస్థకుఁ బాల్పడిన యువరాజు జీవితాశవీడి యట నిలుచుటయే పాడియని తలంచెను. శాశ్వత దుర్యశోమగ్నుఁడై మన జూచుటకంటె శాత్రవాధీనుఁడై మరణించుటయే వాంఛనీయమని యాతఁడు భావించెను. కాని, యింకను ఒక సంవత్సరము భయంకరబాధ లనుభవించి భయంకర దుర్మరణమునకుఁ బాల్పడవలసిన యువరాజు నిజమిత్ర హితోపదేశమున సత్వరము హయారూఢుఁడై రాజధానికిఁ బాఱెను.

దారా రణక్షేత్రమున గజావరోహణ మొనరించినంతనే యాతనికి మహాపజయమును, ఔరంగజేబునకు మహావిజయమును బ్రాపించెను. ఆతనిసేనయం దాక్షణమ జయజయధ్వానములు సెలంగెను. రణభూమి శీఘ్రముగ నిశ్శాత్రవమయ్యెను. విజయ మలవడినంతనే యౌరంగజేబు భూమికి డిగ్గి, మోకరించి, కడువినమ్రుఁడై పరమాత్మునకుఁ బ్రమాణములొనరించెను. అనంతర మాతఁడు తనసేనానుల యభినందనములందుకొని వారివారి పౌరుషపరాక్రమములను సముచితముగ నుగ్గడించెను. తన సోదరుఁడగు మురాదును భ్రాతృప్రేమ విరియునట్లు సంభావించి, ఆతని యమేయధైర్యపరాక్రమంబులం గొనియాడి, తన్మహావిజయ సంప్రాప్తి కాతఁడే కారకుండని స్తుతియించి, నాఁటి నుండియు నాతని రాజత్వము ప్రారంభమాయెనని ప్రీతికరముగఁ బలికి, యుద్ధమునఁ దగిలిన గాయములను మాన్పుటకొఱకు నిపుణులగు ఘనవైద్యుల నౌరంగజేబు నియమించెను.

సముగరు యుద్ధవిజయి భావిచక్రవర్తియని విస్పష్ట మాయెను. ఔరంగజేబు రాజధాని కరుదేఱకుండ వారింపఁగల సైన్యము లేదు. భ్రాతృసమరమునందలి ద్వితీయాంకము సమాప్తమాయెను. ఇఁక నాగ్రానగరాక్రమణము, పితృనిర్బంధనము, మురాదు రాజత్వపరిణామము, ఔరంగజేబు కిరీటధారణము గుఱించియు నరయవలయును.

## 5. షా జ హా ను  ని ర్బం ధ ము

సముగరు యుద్ధశతఘ్నీధ్వానము లాగ్రానగరమునకు వినవచ్చెను. యుద్ధ మారంభమాయెనని స్పష్టమయ్యెను. పురజనులు భయవిహ్వలులైరి. దారా జయించునేని రాజధానికిఁ బ్రమాదములేదు. మురా దౌరంగజేబులు పట్టువడకుండినను, భగ్నప్రయత్నులై వెనుకకు మఱలుదురు. అంతటితో విప్లవ మంతరించును. ఒకవేళ వారే జయింతురేని, వారి నెవ్వరు వారింపఁగలరు? పాదుషా యధికారముం ధిక్కరించి యువరాజు నోడించిన రాజకుమారులు రాజధాని నెంత కలంతురో? తామెట్టి దురవస్థకుఁ బాల్పడవలయునో యని పౌరులు పరిపరివిధములుఁ జింతింపుచు మిక్కిలి సంక్షోభించిరి. యుద్ధభూమినుండి యరుదెంచు పాఱుఁబోతు లనేక గతులఁ బల్కుచుఁ బ్రజాళిని మఱింత కలవరపఱచిరి.

యుద్ధమున నోటువడి యధికపరిశ్రాంతుఁడైన యువరాజత్యల్పపరివారముతోడ రేయి తొమ్మిదిగంటలకు నాగ్రా

నగరముం జేరుకొని, పురజనులు భయసంభ్రమపరులై హాహా కారము లొనరింపఁ దన మందిరముం జొచ్చి, తలుపులు బంధించి, బోరున విలపించెను. నాఁటి మహాపజయముచే నాతని హృదయము చూర్ణీకృత మయ్యెను.

ఆ దుర్వార్త షాజహానునకును దెలియవచ్చెను. ఆ వృద్ధుని విషాద మపారము; అనిర్వాచనీయము. దారా హిత కారిణియగు జహానారాయును అత్యంత చింతాక్రాంత యయ్యెను. ఐనను, అట్టి మహాకష్టసమయమునఁ గాలహరణము ప్రాణసంకటము. షాజహానుపాదుషా విషాదమును దిగమ్రింగి, ప్రకృతకార్యనిర్ణయార్థము దారా తనచెంతకు రావలయునని కబురంపెను. కాని, మహాపజయ సంస్మరణనిర్మగ్నుఁడైన భాగ్యహీనునకుఁ బితృదర్శన మొనరించుటకు మోము చెల్లక పోయెను. మఱియు, రెండహోరాత్రములు తెప్పవాల్పక, రణభూమియం దొక్క క్షణము విశ్రాంతి గొనక, పథశ్రమ ముచేఁ గీడ్పడి డీలువడిన దారా యొక్క గంటయైన నూఱట గాంచవలయును. అధికకాల మట విడియుటయు నసంభవము. యమభటులను బోలు వైరు లరుదేఱకమున్నె, యాతఁడు సురక్షితస్థానమునకుఁ బోఱవలయును. కావున, యువరాజు పితృసన్నిధికిఁ బోఁజాలక పోయెను.

దారా శీఘ్రముగ రాజధాని వీడవలయును. కావున, షాజహాను తత్క్షణము తదుచిత ప్రయత్నము లొనరించెను. తన ధనాగారమునుండి ధనరాశిం దీయించి యాతని కంపు

టయేగాక, దారాకు సర్వసదుపాయము లొనరించి యాతని యాజ్ఞానువర్తియై మెలఁగవలయునని ఢిల్లీదుర్గపాలకునకు వర్తమాన మంపెను. యువరాజొక జాము విశ్రమించియుండును. అమూల్యాభరణాది వస్తుచయము మాత్రము గొని, పదిమంది భటులు వెంట నరుదేఱ, తన భార్యాపుత్రులతోడ షాజహాను చక్రవర్తి జ్యేష్ఠకుమారుఁడు ప్రముచ్చువలె రేయి మూఁడవ జామున ఢిల్లీపట్టణమునకుఁ బ్రయాణ మయ్యెను.

ఔరంగజేబు రెండు దినములలో నాగ్రానగరము సమీపించి, పదిదినములొక తోఁపునందు విడిసియుండెను. అతని సైన్య మనుదినము వర్ధిల్లుచుండెను. సాధారణ సైనికులును సాధారణోద్యోగులేగాక, షయిస్తఖాను మొదలగు ప్రముఖులు గూడ నాతనిఁ జేరిరి. ఔరంగజేబునకుఁ బెన్నిధివలె దొరికిన మీర్జుమ్లాయొక్క కుమారుఁడు—అమీనుఖానుఁడాతని బహిరంగముగా నాశ్రయించెను. నూతనాగతులను యథార్హంబుగ సంభావింపుచు, దన సైన్యమువలన రాజధానికి నష్టము వాటిల్లకుండ చూచుచు నౌరంగజే బప్రమత్తుఁడై యుండెను.

అతఁడింతవఱకును షాజహానును బహిరంగముగా ధిక్కరింపలేదు. షూజా మురాదులవలె నాతఁడు నిజరాజత్వప్రకటనాద్య వివేకకార్యము లొనరింపలేదు. పాదుషా యాజ్ఞకు విరుద్ధముగ మీర్జుమ్లాను దనచెంత నుంచికొనినపుడును, తాను మహాసేనాసమేతుఁడై మురాదుతోడ బయలుదేఱినపుడును,

ధర్మతు యుద్ధమునందు యశవంతసింహ మహారాజును గొట్టి విజయము గాంచినపుడును, తుదకు సముగరు యుద్ధమునందు దారాను భంజించి మహావిజయముం జూరగొనినపుడును గూడఁ దన విస్పష్టచర్యల నెట్టులో యాతఁడు సమర్థించుకొనుచుండెను. పితృసందర్శనార్థము తా నరుదెంచుచుండ, నాఁడు యశవంతునివలె నేఁడు దారాయును మార్గావరోధ మొనరించుటచేతనే నాఁటివలె నేఁడును దాను రణమొనరింపవలసి వచ్చెనని సముగరు యుద్ధానంతర మౌరంగజేబు షాజహానునకు వ్రాసెను. అందులకుఁ బ్రత్యుత్తరముగా వాత్సల్యపూరితమగు సందేశ మంపి, షాజహాను తన కుమారునిఁ జూడఁగోరెను. అనంతర మట్టిసందేశమేగాక 'అలంగీరు' (విశ్వవిజయి) అను ప్రసిద్ధఖడ్గమును గుఱి యనేక బహుమానములను గూడ నాతఁ డంపెను. పితృదర్శన మొనరించుటకు మొదట సమ్మతించియు నౌరంగజేబు మఱునాఁడు నిరాకరించెను. తండ్రీ కుమారులు గలసి పరస్పరము సంభాషించి వ్యవహారము బరిష్కరించుకొనుట వాంఛనీయమే యైనను, దారా పక్షపాతియగు జనకుఁడు తన్ను బంధింపవచ్చునని యౌరంగజే బనుమానించుట యనుచితముగాదు.

ఆగ్రాదుర్గ మాక్రమించుట కౌరంగజేబు సంసిద్ధుఁడయ్యెను. అరక్షితమగు నగరము సులభముగా నాతని యధీనమయ్యెను. ఇఁక దుర్గము నాక్రమింపవలయును. షాజహాను క్రుద్ధుఁడై, దుర్గరక్షణ మొనరించుకొనుటకుఁ గృతనిశ్చయుఁడై,

శీఘ్రముగ సన్నద్ధుఁడయ్యెను. ఈ సందర్భమున నొక విషయము గమనింపవలయును. ఔరంగజేబు పలుకులు పాటింతుమేని, అతఁడు దారామీఁద మాత్రము పగగొని యుండెను. తండ్రియెడ వైరభావముఁ జూపకుండుటయేగాక, పితృవాత్సల్యమునకుఁ గొఱఁత లేనట్టులే యతఁడు మెలంగుచు వచ్చెను. కాని, దారా యిప్పు డాగ్రానగరమునందు లేఁడు గదా! దారా లేకున్నను ఔరంగజేబు దుర్గము నాక్రమింపఁగడం గుటచేత నతని యధాతత్త్వ మిపుడు పూర్తిగ వ్యక్తమయ్యెను.

దుర్గమునందుఁ బదునైదువందల బానిససైన్యము మాత్ర ముండెను. వా రందఱు నన్యదేశస్థులైనను విశ్వస నీయులు. సేన యల్పమైనను దుర్గము దృఢప్రాకారపరిరక్షితమై, విశాలపరిఖాపరివృతమై, శతఘ్నీసమృద్ధమై దుర్భేద్యమై యుండెను. ఔరంగజేబు ఫిరంగులు వప్రభేదన మొనరింపఁ జాలకపోయెను. సొరంగములు తీయించి, మందు నింపి, గోడ లను నిర్భిన్న మొనరించుటయు నసాధ్యము. మిగుల కష్ట మైనను పరిఖాతరణ మొనరించి గోడల కెగఁబ్రాఁకఁ గడంగిన సాహసులు శాత్రవాగ్నిగోళములచే దగ్ధమైరి. ఇఁక ముట్టడియే శరణ్యము. కాని, యందులకు దీర్ఘకాలము గావలయును. అంతవఱకును దారాను వీడి యతనిని సేనాసంచయ మొన రింపనిచ్చుట యవివేకము. అట్టిక్లిష్టసమయమునందు ధీమంతుఁ డగు నౌరంగజేబు తన మంత్రులతోడ మంతన మొనరించి, యొక సూక్ష్మోపాయముచే నా మహాదుర్గమును సులువుగా

సాధించెను. అనేక రాజమకుటఘటితపాదుఁ డగు షాజహాను పాదుషా ముహూర్తమాత్రమునఁ దన పుత్రున కరిగాపయ్యెను. యమునానదీనీరమును గొంపోవుటకు దుర్గమునందొక ద్వార మేర్పడి యుండెను. ఔరంగజేబు సైనికులు సమయము గని పట్టి, యచటి భటులపై నాకస్మికముగాఁ బడి, యా ద్వార మాక్రమించిరి. ఆసైనికులందు సురక్షితముగా దాఁగియుండి యావంక కేతెంచువారినిఁ బరిమార్చుటకు వీలుగానుండెను. ఆకారణమున నిర్మలనదీతోయము దుర్గమునకు రాకుండఁగట్టు వడెను. ప్రక్కను యమునానది కలదని దుర్గస్థకూపము లుప యోగింపమి, నయ్యవి పాడువడెను. నిర్మల హిమాంబువులు త్రావు శ్రీమంతులకును, ఉన్నతోద్యోగులకును ఆ దుర్జలంబులు దుస్సహము లయ్యెను. వారలేగాక, షాజహాను చక్రవర్తి సహిత మా దుష్టక్షారజలపాన మొనరింపవలసినవాఁ డయ్యెను. అట్టి యపూర్వ బాధాకరావసరమున నతఁ డౌరంగజేబునకు వ్రాసి పంపిన పద్యభావము స్మరణీయము—

"కుమారా! శూరుఁడా! సర్వము దైవాజ్ఞాబద్ధము. నా క్రూరావస్థకు విధి నేలనిందింపవలయును? నిన్నటివఱకు సహస్ర సహస్ర సేనాధినాథుఁడై రాజిల్లిన రారాజునకు నేఁడు గిన్నెడు జలము కరవయ్యెను!

హిందువులు ధన్యాత్ములు. వారు తమ పితృదేవతలకు నిరంతర జలతర్పణము లర్పింతురు. కుమారా! నీవో? నేను

జీవించియుండఁగనే జలమీయక బాధించుచుంటివి : నీ వపూర్వ మైన మహాత్మ్యదీయుఁడవు !

కుమారా ! నీ ప్రస్తుత భాగ్యము దలంచి గర్వింప కుము. ఈ ప్రపంచము విశ్వాసశూన్యము. గర్వాంధుఁడవై ప్రమత్తుఁడవు గావలదు. అనిత్యమగు నీజగము తమోలోక మునకుఁ గొంపోవు మార్గము మాత్రమే యని యెఱుంగుము. దైవచింతానిమగ్నుఁడవై, మానవదయాపరతంత్రుఁడవై మను దేని, నీకు నిత్యైశ్వర్యము ప్రాపించును."

కాని, కార్యశూరుఁడగు నౌరంగజేబు బంతమాత్రమున మెత్తపడలేదు. షాజహా యనుచరుల స్థైర్య మంతకంతకుక్షీణిం చుచుండెను. తన కుమారుని కాఠిన్య మెట్టిదైనను దొలఁగించి ప్రసన్ను నొనరించుకొనవలయునని యావృద్ధరాజు మగుడ నొక దీనసందేశ మంపెను. ఔరంగజేబు తనప్రవర్తనమును సమ ర్థించుకొనుచు నిట్లు ప్రతి సందేశ మంపెను.— "కొన్ని కారణములచేత భవదీయ దివ్యదర్శన మొనరింపఁ జాలక పోతిని. దుర్గప్రవేశమున కనుజ్ఞ దయచేయుదువేని నా యను మానము పాయును. అపుడు నీ సన్నిధి కరుదెంచి, నీవేమి పంచిన నట్లు చేయుదును. నీకపాయము వొరయనేరదు."

షాజహాను దుర్గద్వారము దీయించెను. ఔరంగజేబు సైనికులు వెంటనే యందుఁ జొచ్చి, యాద్వారమునే గాక, దుర్గ మంతయుఁ గూడ స్వాధీనపఱచుకొనిరి. సంఖ్యాతీత ధన సమృద్ధమగు మహాదుర్గ మౌరంగజేబునకు సులువుగాఁ జిక్కెను.

కుమారుని విశ్వసించిన షాజహాను – మహాసామ్రాజ్యమును శాసించిన మహానేత తన రాజధానియందే, తనదుర్గమునందే బంధితుఁడై పోయెను.

సోదరుఁడు తన మాటఁ బాటించు నని యాసించి జహానారా యౌరంగజేబును దర్శించెను. ఆ సోదరి దారా పక్షపాతి యైనను, ఔరంగజేబు కృతజ్ఞతాభిమానములకు పాత్రయై, మాననీయయై యుండెను.

అలనాఁడా కోమలహేమగాత్రి యనలదగ్ధయై మృత ప్రాయయై సొలుగునప్పు డితరసోదరులవలె నౌరంగజేబు కూడ జహానారాను గాంచుట కత్యాతురంబున వెడలియుండెఁ గదా! అతఁడా సమయమున నుద్యోగరహితుఁ డగుటయు, కరుణా సముద్రయగు జహానారా సాహాయ్యమున నాతఁ డుద్యోగ మునఁ బునఃప్రతిష్ఠితుఁ డగుటయుఁ గాంచియుంటిమి. ఔరంగ జేబు తన రెండవ దక్కనుప్రతినిధిత్వమునందు జనకుఁ డకారణ ముగఁ దనపైఁ గినిసి యనుమానించి మిక్కిలి యవమానించు చుండెనని విలపించుచు జహానారాకే తన హృదయారాటముఁ దెలిపియుండెను. అట్టి యాసోదరి యిపు డౌరంగజేబునుగాంచి సోదరప్రేమ పురస్కృతయై యాతనికి హితము నుపదేశించెను. కేవల హితోపదేశమేగాక, యాతనికి గడు లాభకరమగు పగిది సామ్రాజ్యవిభాగమును సూచించెను. పంజాబు, బంగాళా, గుజరాతు రాష్ట్రములు దారా షూజా మురాదులకును, దక్కనురాష్ట్ర మౌరంగజేబు కుమారునకునకు బంచియిచ్చి,

యౌరంగజేబు యువరాజ బిరుదధుర్యుండై తక్కుంగల దేశముం బాలింపవలయునని పలికి, వృద్ధజనకుని దర్శింప వలయునని జహానారా బ్రతిమాలెను. దారా హైందవ మతాభిమానియై నీతిబాహ్యుం డయ్యెనుగాన వానింబట్టి వధించువఱకుం దాను పితృదర్శన మొనరింపనని యౌరంగజేబు బదులాడెను. ఐనను మాతృసమానమగు జహానారామాట ద్రోసివేయంజాలక యతండు జనకుని గాంచుట కియ్యకొనెను.

కాని, యౌరంగజేబు దారాను వధింపవలయును. షాజహాను నధికారరహితునిగ, స్వాతంత్ర్య రహితునిగ నుంచవలయును. రాజ్యము నిశ్శాత్రవమైనంగాని రాజత్వము నిరాఘాటముగా సాగనేరదు. కావున, తాను బంధించిన జనకునిం గాంచుట నిరర్థకము, అయుక్తము, రాజనీతివిరుద్ధము. ఐనను అతండు లోకానుభవముగల కార్యదక్షుండగుటచేత, పితృసన్నిధికిం బోవువానివలె గజారూఢుండై వైభవముతోడ దుర్గమునకుం బయనమయ్యెను. ఆసమయమున షయిస్తఖాను హాయారూఢుండై పరుగునవచ్చి, యంతఃపురముం బ్రవేశించునంతనే షాజహానుయొక్క తార్తారుజాతి స్త్రీభటులాతని వధింతురని వెఱపించి, యౌరంగజేబును వారించెను. ఆ సమయముననే షాజహానుబానిస యరుదెంచి, యొకజాబు నాతని కందిచ్చెను. అయ్యది దారాకు షాజహాను వ్రాసినది. అందలి సమాచారము గమనింతము. "దారా! నీవు ఢిల్లీయందే యుండుము. నీకుంగావలయు ధనమును సేనయు సందుంగలవు. ఇచటి వ్యవ

హారము నేనే పరిష్కరింతును. నీవు స్థిరచిత్తుఁడవై యచటనే భద్రముగ నుండుము." జనకుని ఘాతుకస్వభావము వ్యక్తమయ్యెఁగదా! ఇఁక నాతనిఁ జూడబోవుట యసంభద్ధము! ఔరంగజేబు గిఱ్ఱునఁదిరిగి దారామందిరమున విడిసెను. షాజహాను నిర్బంధము కఠినతరమయ్యెను.

ఔరంగజేబు యుక్తి యపూర్వము, యమోఘము. అతఁడు పితృదర్శనార్థియై పురప్రవేశ మొనరించుట, దుర్గము సమీపించునప్పుడు షయిస్తఖాను ప్రత్యక్షమై యట్లువారించుట, అదేసమయమునకు విశ్వాసఘాతుకుఁడగు బానిస దారా కీయ వలసిన పత్ర మౌరంగజేబున కందిచ్చుట — తాదృశవిషయ సంఘటనము కాకతాళీయముకంటె విశేషన్యాయముగఁ గాన్పించును. ఔరంగజే బిట్టి యుపాయము లనేకములు ప్రయోగించెను. అయ్యవి ముస్ముందుఁ దెలియఁగలవు.

రాజధాని స్వాధీనమాయెను. పాదుషా బంధీకృతుఁడాయెను. ఔరంగజేబు ప్రతిష్ఠ దశాధికమయ్యెను. అతఁడే యిఁక సమ్రాట్టని స్పష్టమయ్యెను. ఐనను వెంటనే, కిరీటధారణ మొనరింపక, యాతఁడు ప్రభుత్వము మాత్రము వహించి, గొప్ప దర్బారు గావించి, తను నాశ్రయింపఁగోరిన వజీరు మొదలగు నున్నతోద్యోగులను సముచితముగ సంభావించెను. రెండు దినములలో వలయు నేర్పాటులన్నియు నొనరించి, దారాను వెన్నాడుటకై యతఁడు పదమూడవ తేదీని బయలుదేరెను.

దారాషూజా లడంగినఁగాని, యౌరంగజేబు రాజత్వము స్థిరపడనేరదు. ఆ కారణమున నామహాశూరుఁడు విశ్రాంతిఁ గోరక, తదుగ్రకార్యనిమగ్నుఁడై క్రమముగాఁ గృతకృత్యుఁడయ్యెను.

## మురాదుపతనము

కాని, దారాషూజాలు గాక, మురాదే భ్రాతృక్రోధాగ్నికిఁ బ్రథమేంధనమయ్యెను. మురాదు వివేకవంతుఁడై వేచియుండినచో నేమాయెడిదో చెప్పజాలము. కాని యాకనిష్ఠ సోదరుఁ డనలసన్నిహితమగు శలభముమాడ్కి తన చేటుఁ దెచ్చుకొనెను.

మురాదు స్వభావ మరసియుంటిమి. షాజహాను వ్యాధిపీడితుఁ డయ్యెనని తెలిసినంతనే గుణవంతుఁడగు వజీరుని వధించి, పాదుషాకుఁ జెందియుండిన సూరతునగరమును దోపిడిచేయించి, యమితోత్సాహమునఁ గిరీటము ధరించెను. కాని, యతఁ డౌరంగజేబుతోడఁ గలసినంతనే యాతని నాయకత్వమున నొడఁబడి తదనుగుణముగఁ బ్రవర్తించెను. ఔరంగజేబాకప్పుడు కేవలనిస్సంగునివలెను, నీతిబాహ్యుఁడగు దారాను దండించు నిష్కామకర్మ మొనరింపఁబూనిన వానివలెను వర్తించెను. మురాదున కర్ధసామ్రాజ్య మిత్తునని యొకసారి చెప్పెను. సముగరు యుద్ధానంతరము తన సోదరుని యద్వితీయపరాక్రమమును ధారాళముగఁ బ్రశంసించి, నాఁటి

నుండియు నాతని రాజత్వము ప్రారంభమాయెనని యౌరం జేబు ప్రీతికరముగఁ బల్కెను. మురాదు హర్షాబ్ధి నోలలాడెను.

కాని, సముగరు యుద్ధముతోడ నౌరంగజేబు ప్రతిష్ఠా గరిష్ఠుఁడయ్యెను. రాజనామము లేదుకాని తదధికార మాతని యధీన మయ్యెను. మురాదు క్రోధప్రకంపితుఁ డయ్యెను. తన తోడి సోదరుఁడు, తనసహాయమున విజయములు గాంచిన సోదరుఁడు, తన కర్ధసామ్రాజ్య మిచ్చెదనని యొడఁబడిన సోదరుఁడు తనకు సామ్రాజ్యమంతయుఁ ఒట్టముగట్టెదనని భ్రమ గొల్పిన సోదరుఁ డిపుడు పితృనిర్బంధకుఁడై, తన్మహాధికార వైభవాక్రాంతుఁడై, సర్వజనవంద్యుఁ డయ్యెను. తనుఁ బ్రశం సించువా రెవ్వరును లేరు. మురాదు చిత్త మీర్ష్యానలతప్త మయ్యెను. అసూయయేగాక యనుమానముగూడ నాతనిఁ గలంచెను. తానింక నుపేక్షించినచోఁ దన కర్ధరాజ్యమైనను జిక్కదని భీతిల్లి, స్తుతిపరాయణుల కారణమున గర్వించి, యామూర్ఖుఁడు సామ్రాజ్యసంపాదనప్రయత్నము లొనరించెను.

మురాదు తన సైన్యమును పెంపుజేసెను. ఔరంగజేబు నాశ్రయించిన సైనికుల కధికవేతన మిత్తునని కొందఱి నాక ర్షించెను. ఔరంగజేబు కఠినపరిపాలనమున నుండజాలక మఱి కొందఱాతనిఁ జేరిరి. అతని సైన్యము క్రమముగా నిరువది వేలయ్యెను. ఔరంగజేబువలె నాతఁడును దర్బారుగావించి, తన వారలకు బిరుదము లొసంగెను. తుద కాతఁడు తనసోదరుని దర్శించుటయే మానివైచెను.

కాని యౌరంగజేబుతోఁబాటు మురాదుగూడ బయలు దేఱెను. అతని శిబిరము ప్రత్యేకముగ దవ్వున నుండెను. అతని సైన్య మంతయు నాతనితోడనే యుండెను. మురాదు సేనాపరిపాలన మెఱుంగని కారణమున నతని సైనికులు నిర్భయముగా నత్యాచారము లొనరించుచుఁ బ్రజాపీడన మొనరింపఁ దొడఁగిరి. ఔరంగజేబు వారిని వారింపఁజాలకపోయెను. దారాను వెన్నాడు సేనాని యట్టి యాగడము లెట్లు సహించును? మురాదు సైన్యమునందలి యశిక్ష యంటురోగము వలెఁ దన సైన్యమునకుఁ గూడ సోఁకవచ్చును. మరియుఁ దన యున్నతి సహింపక తనవెంట మహాసైన్యముతోడ నంటి యుండు సోదరుఁడు సమయము జూచి యాతని నెదిరింప వచ్చును. అట్టివాని యునికి యపాయకరము. కావున మేధావి యగు నౌరంగజేబు భయంకరసూక్ష్మోపాయముచే నా భ్రాతృకంటకమును సుళువుగాఁ దొలఁగించెను.

ధనము చాలదని మురాదు చీకాకుపడుచుండెను. ఔరంగజేబు తోడనే రెండువందల ముప్పదిమూఁడు హయములను, ఇరువదిలక్షల రూపాయలను బంపెను. యుద్ధానంతర మలవడు శాత్రవధనంబులలోని మూఁడవపా లిత్తుననిగూడ నాతఁడు సమయ మొనరించినంతనే, మురాదు సంకుచిత మానసన మొక్కసారి యుప్పొంగెను. ఆతని క్రోధానుమానములు సమసెను. హృదయము యథా భ్రాతృప్రేమ ప్రపూర్ణమయ్యెను. ఔరంగజే బొకనాఁడు తమ్ముని విందునకుఁ

బిలిచెను. అనుమానమువలననో యనుచరుల హితమువలననో యతఁ డుపేక్షింప, నౌరంగజేబు మఱలమఱల నాహ్వానించెను. ఒకనాఁడు మురాదు వేఁటకుఁ బోయి, విధి ప్రేరణమున నప్రయత్నముగా భ్రాతృశిబిరముఁ బ్రవేశించెను. ఔరంగజే బానందపరవశుఁడై యాతనిం దన యభ్యంతరమందిరము నకుఁ గొంపోయి, సుఖాసీను నొనరించి, కుశలమరసి, యాతని నెంతయేని గౌరవించెను. ఆ భాగ్యహీనుఁ డనంతరము భోజన మారగించి, తన యలసట పాయునట్లు మధురసముఁ ద్రావి త్రావి, శయ్యాగతుఁ డయ్యెను. ఒక కోమలి యూరుసంవాహన మొనరింప నాతఁడు గాఢనిద్రాపరుఁ డయ్యెను. మురాదు కనువిచ్చి చూచుసరికి, ఆకాంత లేదు, అతని యాయుధములు లేవు. సాయుధులగునౌరంగజేబు భటులను గాంచి భయభ్రాంతుఁడై, నిరాశాజనితక్రోధావేశమునఁ దన యన్నను దూషించెను. అతఁడా చాటుననే యుండి యిట్లు బదులాడెను — "తమ్ముఁడా! నీ వవివేకివై గర్వాతిరేకమున నోడ లెఱుంగక ప్రజాపీడన మొనరించుచుంటివి. నీకారణమున దేశశాంతి భంగపడును. ప్రజలు ప్రభుత్వవిముఖులగుదురు. కావున, నీవు కొన్నిదినములు నిశ్చింతగ, నిర్బాధకముగ, హాయిగ నొకమూల నొదిగి యుందువేని, నేఁజేయవలసిన కార్యములు తీఱునంతనే నీవు రాజ్యారూఢుఁడవు కాఁగలవు. అన్యథా తలంపకుము. పరమాత్మునితోడు! నీ కపాయము

దలపెట్టువాఁడను గాను. దైవమును విశ్వసింపుము. వివేక వంతుఁడవు గమ్ము. భయవిచారములు దక్కియుండుము."

మురాదునకు సువర్ణనిగళము దగిలించి, యేనుఁగ మీఁద సంవృతమగు పల్లకియందుఁ గూర్చుండఁబెట్టి, తగు సైన్యముతోడ నౌరంగజేబాతని ఢిల్లీయందలి సలీముగరు దుర్గమున కంపి, యందు బంధించెను. మురాదు పరివారమింకను నౌరంగజేబు శిబిరమునందుండి యాతనికొఱకు నిరీక్షించు చుండెను. మురా దారోహించిన గజముతోఁబాటు మఱి మూఁడింటినిగూడ నాసమయమునకే సిద్ధపఱచి, వానిని మిగి లిన మూఁడు దిక్కులకునుఁ బంపెను. అట్టి యుపాయముచేత మురా దెటుఁబోయెనో యెవ్వరికిఁ దెలియకుండెను.

మఱునాఁడు మురాదుసేన యంతయు నౌరంగజేబు నాశ్రయించెను. తన స్వామిపతనమునకుఁ దోడ్పడిన విశ్వాస ఘాతకులు బహుమానములు వడసిరి. ఔరంగజేబు నిశ్చల చిత్తుఁడై దారాను వెంటాడెను.

## మురాదువధ

మురాదు చరిత్ర యిచటనే ముగింతము. గ్వాలియరు దుర్గమునం దతఁడు తన కుమారునితోడ మూఁడు సంవత్సర ములు జీవించెను. ఆతని యపారదాతృత్వము గాంచిన యను చరులు గొంద ఱాతనిం జెఱనుండి తప్పించుటకుఁ బ్రయత్నిం

-చిరి. వారలొక రేయి దుర్గప్రాకారమునకుఁ ద్రాటినిచ్చెనం దగిలించి, యాక్రింద నొక యశ్వమును సిద్ధపఱచి, మురాదున కెఱిఁగించిరి. సరస్వతీబాయి నామధేయ యగునొక యుంపుడు కత్తె యాతని కుపచారము లొనరింపుచు నాతని కెంతయుఁ బ్రియతమయై యుండెను. ఆ మందభాగ్యుఁ డా కాంతకుఁ దెలుపకుండ వెడలనొల్లక, దుర్మరణమునకుఁ బాల్పడెను. సరస్వతీబాయి యాసమాచార మాలించినంతనే భయాతురయై యాక్రందన మొనరించెను. కావలివాండ్రు ప్రబోధితులై యామోసము గనిపట్టిరి.

మురాదు ప్రయత్నము విఫలమైనను, ఆ సమాచార మౌరంగజేబునకుఁ దెలియవచ్చెను. మురాదువలనఁ దన కెట్టి భయంబును రాకుండ వానిని గడతేర్పవలయునని యతఁడు కృతనిశ్చయుఁ డయ్యెను. కాని, తన సోదరుని నిష్కారణ మరణమునకుఁ బాల్సేయ నొల్లక యాతఁ డొక నెప మరసెను. షాజహాను వ్యాధిగ్రస్తుఁ డయ్యెనని తెలిసిన మహాసమయమున మురాదు తన వజీరు నన్యాయముగఁ జంపించెను. ఆలీనకీ నామధేయుఁ డగు నా వజీరుని కుమారుఁ డొకఁ డౌరంగజేబు ప్రేరణంబున మురాదు తన తండ్రి నకారణముగఁ జంపెనని యభియోగము దెచ్చెను. ఔరంగజేబు పాదుషా యాజ్ఞానువర్తియగు నచటి కాజీ యానేరమును విచారించెను. న్యాయస్థానమునకుఁ దేఁబడిన మురాదు సమాధాన మీయనొల్లక,

క్రుద్ధుఁడై గంభీరముగ నిట్లనెను.—"పాదుషా యనేకములగు ఖరారు లొనరించెను: వానిని విస్మరింపక యీ దీనుని మన్నించునేని, పాదుషాకు సహాయము దలపెట్టక జీవింతును. అట్లుగాక, నన్ను వధించుటకే నిశ్చయించెనేని, నాకీ హీనుల తోడఁ బ్రసక్తియేల? నీ చిత్త మెట్టులో యటు లొనరింపుము."

న్యాయాధిపతి మురాదునకు మరణశిక్ష విధించెను. తోడనే యిరువురు బానిస లాతని వధించిరి.

## కి రీ ట ధా ర ణ ము

1658 జూను 5 తేదీని దారా ఢిల్లీనగరము జేరెను. మార్గమధ్యమున నైదువేల సైన్యము ప్రోవయ్యెను. ఆ రాజ ధానియం దుండి సేనలు కూర్చుకొని, షూజాపై దాడివెడలిన తన కుమారుఁడు సులేమానుఁ డరుదెంచువఱకు వేచియుండి యప్పు డౌరంగజేబును దాఁకవలయునని యతఁ డేర్పఱచుకొనెను.

కాని, ఔరంగజేబుతోడి వ్యవహార మసాధారణ మైనది. ఆగ్రానగర మంత శీఘ్రముగ నాతని యధీన మగునని దారా యనుకొనలేదు. ఆ వార్త తెలిసినంతనే యతఁ డసు భయ విహ్వలుఁడై కర్తవ్య మాలోచించెను. సేన యల్పమగుటచేత వెంటనే యౌరంగజేబును నిరోధింపఁ దలంచుట యసంబద్ధము కాని, దారా కుమారుఁడు షూజాను జయించి యిరువదిరెండు వేల సైన్యముతోడఁ దూర్పున నుండెను. కావున, నటుఁ

బాఱి, దుర్భేద్యమగు నలహాబాదు దుర్గమునందు విడిసి, షూజా సాహాయ్య మపేక్షించి యౌరంగజేబును దాఁకవల యునా? కాని, షూజా తనకు శత్రువు: తన పుత్రునిచే నోటువడిన షూజా ద్విగుణీకృతక్రోధముచే ఘూర్ణిల్లుచుండును. అట్టివాఁ డౌరంగజేబునకుఁ దోడ్పడుట సహజము. కావునఁ దాను పంజాబు దేశమునకుఁ బోవుట వాంఛనీయమని యెంచి, యౌరంగజేబును దప్పించుకొని తన్ను లాహోరుపట్టణమునఁ గలియవలయునని దారా తన కుమారునకు వ్రాసెను. పంజాబు దారారాష్ట్రము; తత్పాలకుఁడు విశ్వసనీయుఁడు; లాహోరు దుర్గమునందుఁ గోటిరూప్యములును, వలయు రణోపకరణము లును గలవు. ఆ భూమి యోధజనావాస మగుటచేత సేనా సంచయము గూడ సులభము. కాని, వర్షము లారంభించునేని ప్రయాణ మసాధ్యమగును. కావున నొక్క వారము మాత్రము ఢిల్లీయందుండి, పాదుషా జ్యేష్ఠకుమారుఁడు పదివేల సైన్యము తోడఁ బంజాబునకుఁ బలాయన మొనరించెను.

ఔరంగజేబు పదమూడవ తేదీని ఆగ్రానగరమునుండి బయలుదేఱెఁ గదా. దారా ఢిల్లీపట్టణము వీడిన వార్త రెండు మూడు దినములలోఁ దెలియవచ్చెను. తదనంతరమే మురాదు బంధీకృతుఁ డయ్యెను. దారాను తానే వెన్నాడవలసిన యవ సరము లేదని యెంచి, యౌరంగజేబు బహదూరుఖానుఁ డను వాని నందులకు నియోగించెను. ప్రసిద్ధమగు నలహాబాదు

దుర్గము నాక్రమించుటకు వేఱొకనిఁ బంపెను. మిగిలిన సైన్యము కొంతకాలము విశ్రాంతిగాంచెను.

ఔరంగజేబున కట్టి విరామము కడు నవసరమై యుండెను. ప్రభుత్వనిర్వహణము సులభసాధ్యము కాదు. ఔరంగజేబు నూతన ప్రభుత్వనిర్మాణ మొనరింపవలయును. లేదేని, యతఁడు ప్రజావిశ్వాసదూరుఁ డగును. కావున నతఁడు రాజ్యాధికారముఁ బ్రత్యక్షముగ వహించి యథారాజ్యపాలన మొనరింపవలయును. జనకుని బంధించి తా నింకను వ్యాజరహితముగ మెలంగఁజూచుట యసంబద్ధము. ఔరంగజేబు శీఘ్రముగఁ గిరీటము ధరించి సామ్రాజ్యమును బరిపాలించుటయే యిఁక నవశ్యకర్తవ్యము.*

కార్యశూరుఁడగు నౌరంగజే బాడంబర మపేక్షింపఁడు. అపుడవకాశముగూడను లేదు. కావున జ్యోతిష్కులేర్పఱచిన సుముహూర్తమునందు ఢిల్లీనగర సమీపమున నా మహాశూరుఁడు నిరాడంబరముగా సింహాసన మారోహించి, అలంగీరు పాదుషా, గాజీ యను బిరుదములు దాల్చెను.

---

* Cf. " At last the time had come for Aurangazebe to throw away the mask and openly realise his long-cherished ambition. The gaoler of Shah Jahan could not pretend that he was only conducting the administration as that Emperor's faithful servant and obedient agent........."

*J. N. Sarkar.*

## 6. ఖ్వాజా యుద్ధము : షూజా పతనము

షాజహాను రెండవ కుమారుడగు షూజా బంగాళా దేశమును బదునేడు సంవత్సరములు పరిపాలించెను. షూజా మహాయోధుఁడు మేధావంతుఁడు. కాని, యాతఁడు క్రమముగా భోగలాలసుఁడై పరిపాలనయం దిసుమంతయు శ్రద్ధ వహింపకపోయెను. షాజహాను వ్యాధిగ్రస్తుఁడై నంతనే షూజా కిరీటము ధరించి, తన రాజత్వముఁ బ్రకటించెను. తైమూరు III, అలెగ్జాండరు II, షాషూజాబహదూరు ఘాజీ-యను మహాబిరుదములు వహించెను : నిజనామాంకితములగు నాణెములు ముద్రించెను : తన నామము మసీదులందు 'ఖుట్బా' చదివించెను. అగ్రజుని భంజించి రాజధాని నాక్రమించుట కాతఁడు మహాసైన్య సమేతుఁడై బయలుదేఱి జనవరి (1658) మాసాంతమునఁ గాశీపట్టణము సమీపించెను.

షూజాను వారించుటకు దారాయును వలయు సన్నాహము లొనరించియుండెను. ఔరంగజేబువలని యపాయమును గుర్తింపనేరని యువరాజు సమర్థులగు సేనానులను — జయసింహుఁడు దిలేరుఖాను మొదలగువారిని షూజాను నిరోధించుటకై నియోగించెను. దారా కుమారుఁడగు సులేమానుఁడా సైన్యమునకు నామమాత్రమగు నాధిపత్యము వహించెను. కాని, యసాధ్యుఁడగు నౌరంగజేబు తమ రిరుపురను నడంచి

రాజ్యాసూఢుఁడగునని దారా షూజా లిర్వురు నెఱుంగఁ జాలకుండిరి.

షూజా సైన్య మత్యధికము. మంచి ఫిరంగిదళమును నౌకాదళమును గూడ గల యాసైన్యము చూచుట కెంతయు భయంకరముగ నుండెను. కాని, విషయ లోలుఁడగు షూజా యుద్ధానుభవ మెఱుంగని మందుని చందమునఁ బ్రమత్తుఁ డయ్యెను. సేనాని యెటులున్న, సేనయు నటులేయుండుఁగదా! అంత దారా కుమారుఁడు చక్కని యుపాయ మాలో చించెను. తన సైన్యమును వేఱొకవంకకుఁ గొంపోవువానివలె సందడిగావించి, యుషఃకాలమునం దాకస్మికముగా శత్రు సైన్యముపైఁ బడెను. షూజా సైనికులు సాయుధులై నిలిచి పోరాడఁ గడంగక, భయవిహ్వలులై పిక్కబలిమిఁగోలఁదిఁ బలాయన మొనరించిరి. హంసతూలికా తల్పగుఁడైఁ సుఖ నిద్రాధీనుఁడై, గతస్మారకుఁడై దివ్యవిలాసినీ సపర్యలం గొనుచు స్వప్నభవానందమున నోలలాడు పాదుషానందనుఁడు వీరుని వలె దిగ్గున లేచి, గజారూఢుఁడై, తన సైనికులను హెచ్చ రింపఁ దొడంగెను. కాని, వాని ధైర్యస్థైర్యము లానమయమున వ్యర్థమయ్యెను. ఎటుజూచినను వైరియూధములు గండుమీఱి యాతని నాక్రమించుటకు డాయుచుండెను. షూజా యుఁకఁ జేయునది లేక యాత్మరక్షణ మరయవలసినవాఁ డయ్యెను.

షూజాకుఁ బ్రాపించిన నష్ట మపారము. సామ్రాజ్యము సంపాదింపవలసిన మహాసైన్యము, మారుతోద్ధూతమగు

మేఘ పటలములవలెఁ బటాపంచలయ్యెను. తుదకాతఁడు వైరికిఁ జిక్కకుండ పలాయన మొనరించుటయే బహుకష్టసాధ్యమయ్యెను. అతఁడు వడివడి మాంగ్హీరు దుర్గముఁజేరి సేనా సంచయ మొనరించుకొని, యచట నదీపర్వతముల నడుమ రెండుమైళ్లు పొడవుగల దృఢమగు గోడ నిర్మించి కడుంగడు నప్రమత్తుఁడై యుండెను. విజయోన్మత్తుఁడై తీవ్రునఁ బొంచివచ్చిన దారా కుమారుఁ డా మహత్తర సన్నాహములను గాంచి చకితుఁడై, కర్తవ్య మాలోచింపవలసిన వాఁడయ్యెను.

అంతలో నౌరంగజేబు ధర్మతుయుద్ధమునందు మహా విజయము గాంచెను. ఔరంగజేబును వారింపనిచో నాతఁడు నిరాఘాటముగా రాజధానిపై దండెత్తి రాఁగలఁడు. అట్టి క్లిష్ట సమయమున జయసింహాది యోధులు దవ్వున నుండుట యనర్థదాయకము. కావునఁ దనతండ్రి యభిమత మెఱింగి సులేమాను షూజాతోడ సంధి గావించుకొని వెనుదిరిగెను. కాని, దారా కుమారుఁడు రాజధానికిఁ బోఁజాలక, యధఃపతితుఁడైన జనకునకుఁ దోడ్పడఁజాలక, స్వీయరక్షణమైన నొనరించుకొనఁ జాలక, తుద కౌరంగజేబునకుఁ జిక్కి, బంధితుఁడై మరణించెను.

దారా కుమారునితోడి సంధి షూజా కెంతయు లాభకరముగనుండెను. ఇంతవఱకు బంగాళారాష్ట్ర మొక్కటియే యాతని యధీనముననుండెను. ఇపుడు, ఒరిస్సా బీహారురాష్ట్రములుగూడ నాతని కొసంగఁబడెను. దేశప్రాప్తి యేగాక, సామ్రాజ్యసంపాదనార్థము పునఃప్రయత్నము లొనరించుటకు

వలయు నవకాశ మేర్పడెను. ప్రసిద్ధమగు సముగరు యుద్ధమునం దౌరంగజేబు విజయాదిత్యుఁడై దీపించి, రాజధానిని వశపఱచికొని, జనకుని నిర్బంధించి, తను ధిక్కరించిన మురాదును నేర్పుమెయి బంధించి, కిరీటము ధరించి, దారాను వెన్నాడుచుండిన సమయమున, షూజా బహుసేనా సమన్వితుఁడై సామ్రాజ్యసంపాదనకుఁ మగుడ సంసిద్ధుఁ డయ్యెను.

షూజా మనోరథము సిద్ధించునట్టులే యుండెను. ఔరంగజేబునకు వెఱచి పాఱిపోవుచుండిన దారా తత్ప్రాంతదుర్గములను షూజా యధీనమొనరింపవలయునని యాజ్ఞాపించెను. చూనారు బనారసు మొదలగుదుర్గములట్లు సుళువుగా నాతనికిఁ జిక్కెను. గంగా యమునానదీ పరిరక్షితమై, దుర్భేద్యమైయొప్పు నలహాబాదు దుర్గముకూడ నాతని వశ మయ్యెను. కాని, షూజా దిగ్విజయ మంతటితో సమాప్తమయ్యెను. అంతలో నౌరంగజేబు కుమారుఁడగు సుల్తాను మహమ్మదు అల్లాబాదునగరమున కనతిదూరమున యుద్ధసన్నద్ధుఁడై నిరోధించెను. ఔరంగజేబు దారాను వెన్నాడుచుండినను, షూజాను గూడ గనిపట్టుచునే యుండెను. వాని నిఁక నుపేక్షించుట యవివేకమని యెంచి, దారాను వెనుదఱుముటకు జయసింహుని నియోగించి, తానును విద్యుత్సన్నిభముగఁ బఱతెంచెను. బహుసమర్థుఁడగు మీర్జుమ్లాకూడ సమయమున కేతెంచెను.

ఖాజ్వాయను గ్రామముచెంత షూజా విడిసియుండెను. అనతి దూరమున నౌరంగజేబు తన సైన్యమును నిలిపి, తత్స

మయానుకూలముగ నొక వ్యూహమేర్పఱచెను (4—1—1658). శత్రుసైన్యమును గాంచినంతనే షూజా తన ఫిరంగులను ముందుకుఁ ద్రోసి యల్పముగ ననలవృష్టి గురియించెను. ఔరంగజేబు శతఘ్నులుకూడ యాదృచ్ఛికముగా మ్రోఁగెను. అంతలోఁ జీఁకటి పడెను. షూజా తన ఫిరంగులను యథాస్థానమునకు మఱలించెను. ఆతఁడు వీడిన తా వున్నతముగ నుండెను. అట్టిస్థలము వదులుట యవివేకము. అనుభవజ్ఞుఁడగు మీర్జుమ్లా తక్షణము తన శతఘ్నుల నయ్యెడ నిలిపెను.

ఔరంగజేబు సైనికులు రేయియందుఁ దనుత్రాణములతోడనే నిద్రించిరి. సేనానులు తమతమ తావులం దప్రమత్తులై యుండిరి. మీర్జుమ్లా సహస్రాక్షునివలె స్కంధావారమంతయుఁ దిరుగాడి తన శిబిరముఁ జేరెను. ఔరంగజేబు పాదుపా యొక చిన్న గుడారమున విశ్రమించెను. రేయి మూఁడు జాము లగుడు నాతఁడు తత్కాలోచితప్రార్థనయందు నిమగ్నుఁడయ్యెను. అట్టి సమయమున నా మహాసైన్యము భయంకరముగ సంక్షోభించెను. కారణమేమి?

జోధపురాధీశుఁడగు యశవంతసింహుఁడు నాఁడు ధర్మతు యుద్ధమున నోటువడి పలాయన మొనరించెఁగదా. ఔరంగజేబు సముగరు యుద్ధమునందు జయించి రాజధాని నాక్రమించినంతనే యశవంతుఁ డాతని నాశ్రయించి షూజా తోడ యుద్ధ మొనరించుటకు సంసిద్ధుఁడై యరుదెంచెను. ఔరంగజేబు పాదుపా సైన్యముయొక్క దక్షిణపార్శ్వ మాతని యధీన

మున నుండెను. ఔరంగజేబటులాతని విశ్వసించి యంతటి ప్రాముఖ్య మొసంగినను యశవంతుఁ డింకను క్రోధఘూర్ణమాన మానసుఁడై యతని నడంచుటకుఁ గృతనిశ్చయుఁడై యుండెను. అందుల కీసమయ మెంతయు ననుకూలముగ నుండెను. ఆ నిశీథ మున నౌరంగజేబుయొక్క సైన్యముపై నాకస్మికముగఁబడి కలంపవలయునని యతఁడు సంకల్పించెను. తన దుష్టసంకల్ప మును షూజాకు రహస్యముగాఁ దెలియఁబఱచి, యతఁ డాసమ యమున మెఱపుమెఱసిన చందమున నౌరంగజేబు సైన్య మును దాఁకి, చెండాడవలయునని యశవంతుఁడు హితముఁ జెప్పెను. అట్టి విశ్వాసఘాతుకత్వము గర్హ్యమైనను, షూజా యటు లాచరించెనేని, యడకొత్తులోని పోకవలె నౌరంగజేబు నలిగిపోయెడివాఁడు.

యశవంతుని దుష్టసంకల్పము మనకుఁ దెలిసెగదా. అర్ధరాత్రము మీఱిన యనంతర మాతఁడు తన పదునాల్గువేల సైన్యముతోడ బయలుదేఱి, తన కడ్డుగనున్న సుల్తాను మహా మ్మదు విభాగముమీఁదఁ బిడుగువలెఁ బడెను. జాగరూకులై కావలియున్న యాయుధీయులను నిర్దయులై రసపుత్ర సైని కులు పరిమార్చిరి. మహామ్మదు శిబిరమునందలి ధన కనకా దులు పూర్తిగ యశవంతునకుఁ జిక్కెను. ఔరంగజేబు శిబి రముగూడ దోపిడిపాలయ్యెను. తత్సమయ సముద్భవ మహా సంక్షోభము సైన్యమంతటను వ్యాపించెను. యశవంతుఁడట్టి భీభత్స మొనరించి, తన్ను నిరోధింపఁ గడంగువారలను దెగ

నఱికి, యనంత ధనకనకాదులనేకాక, గజోష్ట్రాశ్వాది జంతు సంతానమునుగూడఁ దరలించుకొని, యౌరంగజేబు పరాజితుండై పట్టుపడెనని త్రోవవెంటఁ జాటుచు, రాజధానికిఁ బ్రయాణమయ్యెను.

యశవంతుని యాగడము షూజాకెంతయు ననుకూలింపవలయును. కాని, యాతని సందేశమును షూజా విశ్వసింపకపోయెను. మాయాప్రవీణుఁడగు నౌరంగజేబు ప్రేరణముననే యశవంతుఁడు తనకా రహస్యసందేశ మంపెనని యనుమానించి యా దౌర్భాగ్యుఁడట్టి మహదవకాశమును బోఁగొట్టుకొనెను.

ఔరంగజేబు స్థైర్యమద్భుతము. తనసైన్యము మహాపజయము గాంచినట్లు ఘూర్ణిల్లుచున్నను, సేనానులు పుంఖానుపుంఖముగ నరుదెంచి యశవంతుని భయంకర దుష్ప్రవర్తనమును నివేదించినను, ఆ మహనీయుఁ డావంతయుఁ జలింపక, 'వాఁడు పోయిన నేమాయె ?' ననునట్లు హస్తచాలన మొనరించి, తదనంతరము తనసైనికుల నిట్లు హెచ్చరించెను :— "ఇట్లు సంభవించుట యదృష్టమని యెఱుంగుఁడు : ఈకాఫరు యుద్ధమధ్యమున నిట్టి దురాచార మొనరించెనేని, మనము పూర్తిగ భంగపడియుందుము : మనశత్రువు యుద్ధమునకు ముందే వీడిపోవుట శుభావహము : మనకు జయము తథ్యము." సైనికులు తోడనే యుత్సాహవంతులై, నిశ్చలచిత్తులై, యుద్ధసన్నద్ధులైరి. యశవంతుని కారణమున

ముప్పదివేల సైన్యము లోపించినను, ఔరంగజేబు సైన్య మింకను నేఁబది వేలుండెను.

సూర్యోదయమైనంతనే పాదుషా సైన్యము వ్యూహ మేర్పడి యుద్ధసన్నద్ధమై యుండెను. జుల్ఫికారుఖాను సుల్తాను మహమ్మదులు పురోభాగమును బాలింపుచుండిరి. దక్షిణ మున నిస్లాముఖానును, రెండవదెస ఖానేదురాను రామసింహు లును నుండిరి. ఆభాగము లొక్కొక్కటి దశసహస్ర సంఖ్యా యుతములై యనేక శతఘ్నీ పరిరక్షితములై యుండెను. వానికి దోహదమగుటకు నాయితమైన విభాగములు బహ దూరుఖాను దావూదుఖాను సుజనసింహుల యాధిపత్యమున నుండెను. ఆవెనుకఁ బాదుషా పతాకముచుట్టు నిరువదివేల మంది యుండిరి. తత్పార్శ్వములను అమీనుఖాను మూర్తజా ఖానులు శాసింపుచుండిరి. ఆపిఱుంద మఱియొకదండు నిలిచి యుండెను. సర్వసేనాధీశుఁడగు నౌరంగజేబు తన్మహాసేనా మధ్యమునఁ దన తృతీయ కుమారునితోడ సమున్నతమత్తేభ మున నారూఢుఁడై యుండెను. మీర్జుమ్లాకూడ నొక మదగజ మారోహించి, తన స్వామికి వలయు మంత్రాంగమొనరించు టకు సంసిద్ధుఁడై యాప్రక్కనే యుండెను. ఆమహాసైన్యము క్రమముఁదప్పక మెల్లగఁ బయనమయ్యెను.

షూజాసైన్య మిరువదిమూడువేలు. శత్రుసంఖ్యముం దయ్యది కడు నీరసము. కాన, రిపుసేనావిభజనమునకు సరిగాఁ బ్రతివ్యూహ మేర్పఱుపఁగడంగు టవివేకము. ఐనను ఆలోపము.

కానరాకుండునట్లు షూజా తన సైన్యమును జక్కఁగదీర్చెను. ఫిరంగిదళము ముంగలనిల్పి మిగిలిన సైన్యమంతటి నా వెనుక నొకబారుగా నిలిపెను. దక్షిణమున నుండిన యైదువేల సైన్యమున కాతని జ్యేష్ఠకుమారుఁడగు జయనుద్దీను మహమ్మదును సయ్యదుఆలము అనువాఁడును నధినాథులై యుండిరి. వామపార్శ్వవిభాగము చతుస్సహస్ర సంఖ్యాయుతము ; తత్పాలకుఁడు హాసేనుఖేష్గి యనువాఁడు. ఆసేనావిభాగములకు దోహదముగ ద్విసహస్రసంఖ్యాయుతములగు సేనలు రెండు సిద్ధముగ నుండెను. ఆమధ్యనుండిన పదివేల సైన్యము నడుమ షూజా గజారూఢుఁడై యుండెను. ఆతని రెండవ కుమారుఁడగు బులందుఆఖ్తరు తన జనకుని చెంతనేయుండెను. తత్పురో భాగమును షేకుజరీపు, సయ్యదు కాశీము అనువారలు శాసింపుచుండిరి. యుద్ధపరిణామము గమనించి సేనావిభాగములను బోషించుట కొక బలము ప్రత్యేకముగ నుండవలయును. కాని, షూజా యట్టి మూలబలమును దాచియుంచుట కవ కాశము లేకపోయెను. కావున, యుద్ధారంభముననే విజృంభించి వైరిని దిగ్భ్రమపఱచి విజయము గాంచవలయునని యతఁడు సంకల్పించెను. ఇట్టి పరిస్థితియం దిదియే కర్తవ్యము.

ఉదయమెనిమిది గంటలకు యుద్ధమారంభమాయెను. రోదసీకుహర మదరునట్లు లుభయసేనల శతఘ్నులు భీషణముగ గర్జించెను. పురోభాగములు రెండును బరస్పరము [illegible]ంచి బాణవృష్టి గురియించెను. షూజా దక్షిణసేనాధి

-నాథుఁడగు 'సయ్యదుఆలము' యుద్ధారంభముననే శ్లాఘనీయ ముగ విజృంభించి శత్రుసంహార మొనరించెను. కవచపరి రక్షితములగు షూజా మదేభములు మూఁడు, రెండు మణు గులు భారముగల యినుపగొలుసులు దాల్చి ఘీంకార మొన రింపుచు బయలుదేఱి, యెవ్వరిని సరకుసేయక యౌరంగజేబు వామభాగమును జిందరవందర యొనరించెను. అంత నౌరంగ జేబు మరణించెనను దుర్వార్త వెలువడెను. ఉన్మత్తగజాభి ఘాతములకే యొాహటించిన సైనికు లిపుడు పూర్తిగ ధైర్య స్థైర్యములుఁ గోల్పోయిరి. షూజాసేనానియు దయ్యమువలెఁ బడి పీడించుటచేత నాశత్రుసైన్యము హాహాకారము లొనరించి విచ్చిపాఱెను.

ఔరంగజేబుతోడ దక్కను యుద్ధములనుండియు నాఱి తేఱిన సైనికులుగూడ భయాతిరేకమునఁ దమతేని విడనాడి యశవంతునిఁ జేరఁబోయిరి. ఔరంగజేబు నంటియున్న సేన యిపుడు రెండు వేలుమాత్ర ముండెను. తద్వామపార్శ్వమును ఛేదించిన షూజా సేనాని యిఁక నౌరంగజేబుపై నుఱుకఁ బోయెను. పాదుషా యవస్థ ప్రమాదకరముగనే యుండెను. కాని, మూర్తజాఖాను హసనాలీఖానులను సేనానులు రయ మ్మునఁ బఱతెంచి వైరిని వారింపఁగడంగిరి. ఔరంగజేబు నిశ్చలచిత్తుఁడై వారికిఁ దోడ్పడెను. అసమానసాహసంబున రిపుచమూ సమూహమ్ములను నుఱుమాడిన సయ్యదు వచ్చిన చందముననే వడివడి వెనుకకు మఱలవలసిన వాఁ డయ్యెను.

అత్తఱి షూజా సముచితగతిఁ దోడ్పడఁజాలెనేని, యాతఁడు జయించుట కవకాశ ముండెడిది.

సయ్యదు మఱలినను, ఆతని గజరాజములు మాత్రము వెనుజూపక, శత్రుఘాతములవలన మఱియుఁ జెలరేఁగి యభినవజలధరముల భాతి గర్జింపుచు శత్రువిచ్ఛేదన మొనరింపుచుండెను. అందొకటి తన స్వామి యభీష్ట మెఱింగిన దానివోలె నౌరంగజేబును సమీపించెను. అట్టి సమయమున నతఁడు తన ద్విరదమును మఱలించెనేని, యౌరంగజేబునకు ఘోరపరాభవంబును, షూజాకు మహావిజయమును బ్రాపించియుండెడివి. ఔరంగజే బా ముహూర్తమున వెనుజూపెనేని, యా సేనయంతయు నాక్షణమ పలాయన మొనరించుట తథ్యము. కాని యతఁ డొక నగమువలె నిలుచుటయేగాక, తన యేనుఁగు చలింపకుండ దాని పాదములు గట్టించెను: డాయనేతెంచు నున్మత్తదంతావళమును శాసించు మావటీనిఁ దుపాకిచేఁ జపించెను. ఔరంగజేబు మదేభము లంతలో బిఱాన నరుదెంచి యా శత్రుగజమును జుట్టివైచెను. ఒక మావతుఁడు తెగువఁజేసి యా వైరివారణముపై నుఱికి, శ్లాఘనీయముగ నద్దానిని శాసించి యాభయంబును బాపఁజాలెను. మిగిలిన శత్రుగజములు రెండును తీవ్రనఁ దిరిగి దక్షిణభాగమును డాయఁబోయెను. అచ్చటి యౌరంగజేబు సైన్యములు శత్రుధాటికిఁ దాళఁజాలనివయ్యెను. కాని, యౌరంగజేబు గండములు గడచినవాఁ డగుటచేతఁ బరిస్థితులఁ బరిశీలించి, చెద

రిన సైన్యమునుఁ జేరఁదీసి విహ్వలించు సైన్యమును బోషించి యఖండవిజయమును గాంచఁ గలిగెను.

షూజా విజృంభణమింకను వర్ణింపవలయు. దక్షిణమున సయ్యదు పరాక్రమించుట గాంచి, షూజా కుమారుఁడగు బులాందు ఆఖ్తరు పురోభాగమును దరలించి వైరి నెదుర్కొనెను. వామపార్శ్వమును బాలించు హసేనుషేఫ్జి మొదలగు వారలు వైరి దక్షిణభాగముపైఁ గవిసిరి. షూజా సైన్యమల్పముగ నున్నను, ఆ యురవడి కోర్వఁజాలక యౌరంగజేబు సైన్యము హేయముగఁ జలించెను. వేఱొకయెడఁ జిక్కువడిన యౌరంగజేబు వారి నాసమయమునందుఁ దలంపఁజాలక పోయెను. కాని, యట నుత్తీర్ణుఁడై యిటుఁ దిలకించినంతనే, యచటి ప్రమాదము దృగ్గోచరమయ్యెను. తత్క్షణమ బోయి తత్సేనారక్షణ మొనరించుకొనుట యవసరము. కాని, తన తావునుండి తా నాకస్మికముగా వెనుదిరుగునేని, పాదుషా పరాజితుఁ డయ్యెనని భ్రమించి తక్కుంగల సైన్యము కలంగును. దాన నపజయము నిశ్చయము. కావునఁ దా నరుదెంచుచుంటినని ముందుగ వార్తనంపి యతఁడా వెనుక వెడలెను.

ఔరంగజే బరుదెంచుసరికి, తత్సేనాధవుఁడగు నిస్లాము ఖానుఁ డారోహించిన యిభ మాకస్మికముగ బెదరి స్వీయ సేనావిధ్వంసమునకు దొరఁగొనెను. కుడివైపుననుండు శతఘ్నీ దళాధిపతి సపుత్రకముగఁ దెగటారెను. ఐనను, సయిఫుఖాను అల్లామఃఖానలు స్థిరచిత్తులై వైరిని నిరోధింపఁ బ్రయత్నించు

చుండిరి. ఔరంగజేబు ప్రవేశించినంతనే షూజా సైనికు లిప్పు డాత్మరక్షణ మొనరించుకొనుటయే యసాధ్యముగ నుండెను. ఆసేనానులు పెక్కండ్రు మరణించిరి. షూజా కుమారుఁడు చేయునది లేక రయమ్మున వెనుదిరుగవలసిన వాఁ డయ్యెను.

ఔరంగజేబు మధ్యమసేనయు శాత్రవునిఁ బాఱఁ ద్రోలఁజాలెను. తోడనే యీ మహాసైన్య మంతయు నొక్క యూఁపునఁబోయి కారుమేఘమువలె షూజా సైన్యమును గ్రమ్మివైచెను. ఆరంభముననే యల్పమగు నాసైన్య మిప్పు డల్పతరమై నికృష్టముగ నుండెను. రిపుశతఘ్నీ గోళములకు షూజాయే గుఱియయ్యెను. ఇంకను గజారూఢుఁడై యుండు టపాయకరమని యెంచి యతఁడు తదవరోహణ మొనరించెను. అంబారియందుఁ దమ నాయకుఁ డగోచరుఁడైనంతనే తత్సైని కులు భయభ్రాంతులై పలాయన మొనరించిరి. వారి నాఁపి, యింకను బోరాడవలయునని యూహించి షూజా గొంతెత్తి తన సైనికులను హెచ్చరింపఁ గడంగెను. కాని, శత్రుసైనికు లంతలో నాతని నాక్రమింప నరుదెంచుచుండిరి. స్వామిభక్తి పరాయణులగు షూజా సైనికులు తమ తనువు లొడ్డి వైరిని వారింప, నాపాదుషా తనయుఁడు నిజపుత్ర సమేతుఁడై సురక్షితముగఁ బాఱిపోఁజాలెను.

యుద్ధము ముగిసినంతనే యౌరంగజేబు నేలకుడిగ్గి, తనకు మహావిజయముఁ బ్రసాదించిన పరమాత్ముని సభక్తికముగ సంస్మరించెను. అనంతరము తన సైనికుల నభినందించి,

తను నాశ్రయింప నరుదెంచిన షూజా సేనానులను సముచిత ముగ సంభావించి, షూజాను దక్షిమి తక్షిమి యడంచుటకు మీర్జుమ్లాను నియోగించి, యౌరంగజేబు నిశ్చింతగఁ దన రాజధానిం జేరెను.

## 7 వ యో రా యి యు ద్ధ ము : దా రా వ ధ

షాజహాను జ్యేష్ఠకుమారుఁడగు దారా యింకను జీవించి యుండెను. అతఁ డంతరించినఁగాని యౌరంగజేబు రాజత్వము నిరాఘాటముగా సాగనేరదు. దారా జ్యేష్ఠుఁడై, జనకునకుఁ బ్రియతముఁడై, యావరాజ్యారూఢుఁడై, యత్యంత గౌర వాధికార వైభవాభిరాముఁడై, మించి యౌరంగజేబునకుఁ బ్రబలవిరోధియై దీపించెను. అట్టివాఁడు సజీవుఁడై యుండుట దుస్సహము, ప్రమాదకరము, రాజనీతి విరుద్ధము.

దారాను బరిమార్చి తద్భయ నివారణ మొనరించు కొనవలయునని యౌరంగజేబు కృతనిశ్చయుఁడయ్యెను. కాన నాతఁడు రాజధాని నాక్రమించి, వృద్ధజనకుని బంధించినంతనే దారాను వెన్నాడ నుద్యుక్తుడయ్యెను. తమ్ముఁడగు మురాదు మార్గమధ్యమున నీర్ష్యానలతప్తుఁడై, ధూర్తుఁడై ధిక్కరించుట చేత సమయజ్ఞుఁడగు నౌరంగజేబు భ్రాతృ ప్రేమార్ద్ర మధుర సంభాషణ సంభావనంబుల నాతని బుజ్జగించి బంధించెను. తదనంతర మాపాదుషానందనుఁడు వడివడి సింహాసనారోహణ మొనరించి దారాను వెన్నాడెను.

లాహోరు నగరమునుండి ముల్తానువఱకును నౌరంగజేబు దారాను స్వయముగా వెంబడించెను. కాని, షూజా యంతలో జెలరేఁగి రాజధానిపై దండెత్తనుండెనని తెలియవచ్చుటచేత నౌరంగజేబు రయమ్మున నటుఁ బోవలసినవాఁ డయ్యెను.

ఔరంగజేబు మఱలినను, ఆతనిసైన్యము దారాను వీడకుండెను. దారా దౌర్భాగ్యము వర్ణనాతీతము. సైనికు లను దినము విడనాడఁ జొచ్చిరి. క్రూరతర శత్రుభయంబున విశ్రమింపఁదగు తా వెఱుంగక నిరంతరాయమానముగఁ బ్రయాణ మొనరింపుచు నంతఃపుర కోమలనారీమణులు పడు బాధల నాతఁడు తిలకింపవలసిన వాఁడయ్యెను. మార్గమధ్యమునఁ దోఁచు నెడారులంబడి పోవునపుడు యమయాతన లనుభూతము లగుచుండెను. దారా యెట్టకేలకు మూఁడు మాసముల లోపున గుజరాతు దేశముఁ బ్రవేశించెను.

గుజరాతు దేశ ప్రవేశము శుభదాయకముగఁ గాన్పించెను. షానవాజుఖాను నామధేయుఁ డారాష్ట్రము పాలించుచుండెను. ఔరంగజేబాతని పుత్రికను వివాహమాడియుండెను; కాని యాసౌభాగ్యవతి తత్పూర్వమే దివి కేగెను. భ్రాతృసమరారంభమున నాఖానుఁ డౌరంగజేబునకు సాహాయ్య మొనరింప నొల్లమి, బంధింపఁబడెను. ప్రకృతము విశాలరాష్ట్ర పాలనము లభించినను, ఖానుఁడు పూర్వాపరాభవ సంస్మరణము నౌరంగజేబుపై రోసి దారాకుఁ దోడ్పడెను. ఖానుఁడు విముఖుఁడగుట కితరకారణములుగూడ నుండవచ్చును. ఏమైనను షానవాజు

నిజాధికార పరిజన సమేతముగా నాలుగు మైళ్ల దూర మెదు రేగి, దారాకు సముచితముగ స్వాగత మొసంగి, రాజధాని యగు నహమ్మదాబాదు నగరమునకుఁ దోడ్తెచ్చి, దుర్గ మాతని యధీన మొనరించెను. పాపమీ యాపద్బాంధవుఁడు దారాకొఱకుఁ బోరాడుచు నచిరకాలమున 'దియోరాయి' యుద్ధమున మరణించెను.

దారా భాగ్యరేఖ బయల్పడినటు లుండెను. నలుబది దినములలోపున నిరువదిరెండువేల సైన్యము సిద్ధమయ్యెను. శతఘ్నులు మొదలగు యుద్ధోపకరణములు గూడ సమ కూడెను. ఇఁక నాతఁడు నేదదేటి సామ్రాజ్యసంపాదన చింతన మొనరింపఁజాలెను. దక్కను దేశమందలి గోలుకొండ బీజపుర రాజ్యములకు నౌరంగజేబు గర్భశత్రువై యుండెఁగదా, దారా వారిపక్షము వహింపనిచో నౌరంగజే బానాఁడే తద్రాజ్య విధ్వంసన మొనరించి యుండును. ఆకారణమున, నాసుల్తానులు దారాయెడఁ గృతజ్ఞులై యుంటయేగాక, ఔరంగజేబు సార్వ భౌమత్వము సహింపకుండుటయును సహజము. కాన, తానటు బోయి వారి సాహాయ్యము వడసి యౌరంగజేబు నడంప వలయునని దారా యోచించెను. కాని, విధివిధాన మవిలంఘ నీయము. అంతకంటెఁ గడు సులభమగు మార్గ మంతలో గోచరించుటచేత, దక్కను దేశ నిర్గమనమును దారా విడనాడెను.

షూజా విజృంభణమునకు వెఱచి గదా యౌరంగజేబు దారాను వీడి యటుఁ బాఱెను. మఱియు, యుద్ధమున

నౌరంగజేబు సంపూర్ణముగ నోటువడెననియు, షూజా మహా విజయము గాంచెననియు, నౌరంగజేబు శిబిరములను యథేచ్ఛముగాఁ గొల్లగొట్టి యశవంతుఁడు తన దేశమునకు వెడలెననియును దారాకుఁ దెలియవచ్చెను. ఇందు యశవంతుని దోపిడి మాత్రము సత్యము. కాని యీ ప్రవాదమును దారా పూర్తిగ విశ్వసించెను. రాజధాని నాక్రమించి జనకుని విడిపించుట కిదియే సమయమని యెంచి యతఁ డజమీరు నగరమునకుఁ గ్షణముఁ బ్రయాణమాయెను (ఫిబ్రవరి 14). కాని, మూఁడు మజిలీలు చేసిన యనంతరము యథార్థము దారుణముగఁ దెలియవచ్చెను. మహావిజయ మౌరంగజేబునకే ప్రాపించెను. దారా కిఁకఁ గర్తవ్య మెద్ది? హతాశుఁడై యుండ, నంతలో యశవంతుఁ డాతని నాహ్వానించెను. ఖాజ్వాయుద్ధము ముందు నాఁడావిధమున నౌరంగజేబును భంగపఱచిన యశవంతుఁ డిపుడు దారాను బురస్కరించుకొని వృద్ధసార్వభౌముని విడిపింపవలయునని తలంచెను. జయపురాధీశుఁడగు యశవంతుఁడు కడుఁ బరాక్రమవంతుఁడు; బహుసేనాబలసంపన్నుఁడు; ఆతని రహతూరు లుద్దండధైర్యశాలురు: ఇతర రసపుత్ర' సేనాసాహాయ్యము గూడ సుసాధ్యము: ఇఁక విజయము నిశ్చయము. కావున, దారా యన్యవిచారముఁ దక్కి, యశవంతు నాహ్వాన మంగీకరించి యజమీరునగరమునకుఁ బయన మయ్యెను.

కాని, యశవంతుఁ డంతలో విశ్వాసఘాతుకుఁడై, మిత్రద్రోహియై, యౌరంగజేబునే యాశ్రయించెను. తద్విషయ మరయుదము. ఖాజ్వా యుద్ధసందర్భమున నపచార మాచరించిన ద్రోహిని దండింపవలయునని యౌరంగజే బొక సైన్యము బంపెను. తాను దారాతోడఁ గలసి యౌరంగజేబు నెదిరింపవలయునని యశవంతుఁ డాలోచించి యాతని నాహ్వానించెను. కాని, యౌరంగజేబు సైన్యము తన దేశముఁ బ్రవేశించినంతనే యా రసపుత్రశూరుఁడు భీరుఁడై నిజరాజ్యాంతరగిరికందరములకుఁ బాఱిపోయెను. ఔరంగజే బాతని దేశమును గొంత చీకాకుపఱచిన పిమ్మట వితర్కించుకొనెను. వెనుదిరిగిన రసపుత్రసింహము నింకను గారించి, యాతనితోడనేగాక రాజపుత్రస్థాన మంతటితోడను గూడ వైరము దెచ్చుకొనుట కంటె, ననునయోపాయమున యశవంతుని లోఁబఱచుకొనుట క్షేమకరమని యౌరంగజేబు విచారించెను. జయసింహుఁడు తదభిప్రాయ మెఱింగి, పాదుషా యశవంతుల కిర్వురకును సఖ్య మొడఁగూర్చెను. ఔరంగజేబు పాదుషా యశవంతుని నేరము సైరించి యాతని కున్నతస్థాన మొసంగెను.

యశవంతుఁ డిట్టి ద్రోహ మొనరించునని దారా యెఱుంగఁడు. అతఁ డజమీరునగర సామీప్యమున విడిసి, యశవంతునకై నిరీక్షించుచుండెను. ఆతని ద్రోహము తెల్లమగుసరికి నౌరంగజేబు ప్రచండసేనాసమేతుఁడై యరుదెంచుచుండెనని తెలియవచ్చెను. మిన్ను విఱిగిపడినట్లు దారా

న్నిరాశాభరమ్మునఁ గ్రుంగిపోయెను. వెనుకకు మఱలి కర్తవ్య మాలోచించుటకు వ్యవధిలేదు. ఆత్మసంరక్షణార్థ మన్యసేనా సాహాయ్యవిరహితముగనే యతఁడు వడివడి యుద్ధసన్నద్ధుఁడు కావలయును.

వైరిబల మనంతము. కాని, దారా యాసమయము నకుఁ దగిన సన్నాహములు ప్రశంసనీయముగ నొనరించెను. ధనధాన్యసమృద్ధమగు నజమీరునగరమునం దతఁ డావాస మేర్పఱచుకొని, 'దియోరాయి' నాఁబడు కొండకనుమయందు శాత్రవుని నిరోధింపవలయునని నిశ్చయించెను. దీర్ఘమును సమున్నతపర్వతపరిరక్షితమును నగు నాకనుమనుండియే రిపు సైన్యము లజమీరునగరము బ్రవేశింపవలయును. స్థానబలము కొలఁది నా తా వధికతరశత్రుసైన్యమును వారించుట కెంతయు ననుకూలముగ నుండెను. ఆకొండలపై సైన్యములు నిలిపి, గిరుల కడ్డుగఁ బ్రాకారములు నిర్మించి, కందకములు తీయించి, యం దందు శతఘ్నులు నిల్పి దారా కడు నప్రమత్తుఁడై యుండెను.

దియోరాయి యుద్ధము మూఁడుదినము లయ్యెను. పాదుషా సైన్యము రెండు దినము లేమియు సాధింపనేరక భంగపడెను. దారా సైనికులు స్వామిభక్తిపరాయణులై, కార్యదీక్షాపరులై, యప్రమత్తులై యరిసేనాప్రవాహమును జక్కఁగ వారించిరి. ఔరంగజేబు కోపానలదందహ్యమాన మానసుఁడై తన సేనానుల నెంతయు నిందించెను. దారా సైన్యము మూఁడవ దినముగూడ నఖర్వబల ధైర్య సాహ

షంబులు సుస్థిరముగఁ బ్రదర్శించెను. పాదుషా సైనికులు విజయము గాంచవలయునని సావేశముగాఁ బోరాడిరి. ఉభయ సైన్యము లాపగిది సాయంకాలము వఱకును ఘోరముగ భండన మొనరించెను. అంతలోఁ బర్వతారోహణ కుశలురగు పాదుషా సైనికులు కొందఱు రహస్యమార్గమున నా నగముం జుట్టి దారా సైన్యము పిఱుంద నాకస్మికముగాఁ దాఁకిరి. దానఁ బాదుషా సైన్యమునకు నూతన జవసత్వము లలవడెను. దారా సైన్యము భయవిహ్వాల మయ్యెను. తనకిఁక నపజయము నిశ్చయ మని గుర్తించి యాత్మసంరక్షణార్థము దారా చీఁకటి చాటునఁ బలాయన మొనరించెను.

చరిత్ర ప్రసిద్ధమగు భ్రాతృమహాసమరమునం దియ్యది తుదియుద్ధము. తదనంతర మౌరంగజేబు తన సోదరులతోఁడ రణమాచరింపవలసిన యవసరములేకుండ, మహావైభవ సమన్వితుఁడై సుముహూర్తమునఁ బట్టాభిషేక మొనరించుకొనెను. కాని, ప్రకృతము విచారింతము. దారాను వెన్నాడుటకు జయసింహ మహారాజును బహదూరుఖానును నియోగించి యౌరంగజేబు మఱునాఁడు తన రాజధానికిఁ బ్రయాణమయ్యెను.

రేయియగుటచేత దారా నిరపాయముగా రణరంగము నుండి పలాయన మొనరింపఁజాలెను. పాపమాతఁడు తన కాంతాజనంబులను గాంచుటకును, వర్తమాన మంపుటకును నవకాశము లేకపోయెను. ఆ కోమలాంగులు మధ్యాహ్నము నుండియుఁ బ్రయాణసన్నద్ధులై యుద్ధపరిణామ మరయుటకుఁ

గడు నాతురమున నిరీక్షించుచుండిరి. తుదకు, విషయము హృదయ విదారణముగ దెలియవచ్చుటచేత నొక విశ్వాసనీయుఁడగు సేవకుని సాహాయ్యము వడసి యంధకారమున వైరులకుఁ జిక్కకుండ వారు వేఱొక మార్గమునఁ బలాయన మొనరించిరి. వారెల్లరు మఱునాఁడు (15 తే) సాయంకాలమునందు సజమీారు నగరమునకు ముప్పదియేడు మైళ్ళ దూరమునఁ గలిసికొనిరి.

దుఃఖభాజనమగు దారా పలాయనము గుఱించి యధికముగ వర్ణించుట యనవసరము. తొల్లి గుజరాతు రాష్ట్రము తన కనుకూలముగ నుండుటచేత, దారా యాశవడి యటుఁ బోయెను. ప్రయాణమెంతయు బాధాకరముగ నుండెను. ఉష్ణమధికతరము, దుర్భరము. వృషభాది మృగసందోహంబులసంఖ్యముగ మరణించెను. ఇఁక నంతఃపురాంగన లెంతబాధ నొందిరో ? చోరులు ఛాయాసన్నిభముగ వెనువెంటనంటి, వెనుకఁబడు పరిజనులను వధించి దోపిడి చేయుచుండిరి. తాదృశ దుర్దశాగ్రస్తుఁడైన పాదుషా కుమారుఁడు గుజరాతు రాజధాని యగు నహమ్మదాబాదు నగరమున కేఁబది మైళ్ళ దూరమున విడిసెను (మార్చి, 29). కాని తత్పాలకుఁ డౌరంగజేబు పక్షపాతియై తను నెదిరించుటకు సంసిద్ధుఁడయ్యెనని తెలియవచ్చెను.

దారా గుజరాతు దేశము వీడవలయును. అతిరయమ్మునఁ బలాయన మొనరింపవలయును. కాని, యెటు బోవలయు ? ఆ భాగ్యహీనున కాశ్రయ మీాయఁగల దాత యెవఁడు ? జయసింహుఁ డాఁకొన్న సింహమువలెఁ గఱువు

కొని విద్యుద్వేగమున నరుదెంచుచుండెను. పాదుషా సైన్యములన్ని దెసలనుండియుఁ గ్రమ్ముచుండెను. ఐనను, అచ్చటచ్చటఁ గాంచిన మిత్రసాహాయ్యమువలన నాతఁడు దుర్గమములగు కచ్ఛిరెడారులు మగుడ దాటి 'మే' నెలారంభమున సింధు దేశముఁ బ్రవేశించెను. కాని యెటుఁజూచినను, పాదుషా సైన్యములు సిద్ధముగఁ దోఁచుచుండుటచేత, హిందూ దేశమున నిలుచు టసాధ్య మయ్యెను. ఇఁకఁ గాంధహారు నగరమునకుఁ బాఱి, యనంతరము పెరసియా దేశము జేరుటయే తరుణోపాయముగ నుండెను.

కాని, భ్రాతృక్రోధాగ్నిం బడి మ్రగ్గవలసిన భాగ్యహీనుఁడు పెరసియా దేశ మెట్లు చేరఁగలఁడు? అతని ప్రియభార్యయగు "నదీరాబాను బీగము" వ్యాధిపీడితయై యిఁకఁ బ్రయాణ మొనరింపఁజాలకపోయెను. దారా యనుచరులు గూడఁ గృశీభూతశరీరులై విశ్రమింపఁగోరిరి. ఇట్లున్నను, రాజ్యసంపాదనార్థము మఱియొక ప్రయత్న మొనరింపవచ్చునను నాశ దారా చిత్తమున నుదయించెను. తత్సమీపమున నున్న భక్కారుదుర్గము నింకను నాతని సేనానియొకఁడు రక్షించుచుండెను. కాన, నచటి బెలూచీ నాయకుల సాహాయ్యమువడసి, రిపుసైన్యమును బాఱఁద్రోలి, యాదుర్గమునఁ దన కాంతాజనంబులను భద్రపఱచి, యాఘ్గను స్థానమునకుఁ బోయి, తొల్లి తన పక్షపాతియై యుండిన యా రాష్ట్ర పాలకుని సాహాయ్యమున సేనాసంచయ మొనరించి, సామ్రాజ్య

సంపాదనార్థము మగుడ నౌరంగజేబుతోఁడఁ బోరాడవలయు నని దారా యోచించెను.

దారా దౌర్భాగ్యమునకుఁ దగిన మిత్రుఁడు దాపురించెను. అచటకుఁ జేరువనున్న 'దాదరు' జమీందారుడు - 'మల్లికుజీవను' నామధేయుఁడు పూర్వమొకపు డొక ద్రోహ నేర మొనరింప, వానిని మదగజముచే మట్టింపవలయునని షాజహా నాజ్ఞాపించెను. ఆసమయమున దారా యడ్డుపడి వానిని మృత్యుముఖమునుండి తప్పించెను. అట్టివాఁడు సహజముగఁ గృతజ్ఞుఁడై తన ప్రాణదాతకుఁ బ్రత్యుపకార మొనరించుటకు సంసిద్ధుఁడై యుండవలయును. దారా యట్టులే యాశించెను. మల్లికుజీవనుఁడు తన దూతనంపి, రెండు మైళ్ళ దూరము తానేయెదురేగి, మహాకష్టసాగరనిమగ్నుఁడైన తన ప్రాణదాతను సవినయముగ సభక్తికముగఁ దన గృహమున కాహ్వానించెను. ఆసమయముననే దారాకుఁ మహాపద వాటిల్లెను. రాజ్యభ్రష్టుఁడై, పడరానిపాట్లుపడు తన పేదమగని పీడనొల్లని సాధ్వీమతల్లి స్వర్గస్థయై దారాను నపార దుఃఖసాగరమున ముంచివైచెను.

దారా తక్షణము పెరసియా దేశమునకు వెడలక, మృత భార్యా సంస్మరణఖేద ఘూర్ణితుఁడై మూఁడు దినములు జీవనుని గృహమున నిలిచెను. అటు లచటఁ దడయుటయేగాక, విశ్వసనీయులగు డెబ్బదిమంది సైనికులతోఁడ నిజభార్యా మృత కళేబరము నామె యాదేశానుసారముగా లాహోరు

నగరమునకుఁ బంపెను. ఆతని యవివేక మంతటితోఁ దీరక పోయెను. మిగిలిన సేవకులకును సైనికులకుగూడ సెలవిచ్చి పంపివై చెను. విశ్వాస ఘాతుకుఁడగు జీవనుఁడు సమయమరసి తనప్రాణదాతను బంధించి యీ వర్తమాన మౌరంగజేబునకు శీఘ్రముగఁ దెలియఁబఱచెను (జూను 9). ఆతని సేనాధ్యక్షుఁడగు బహదూరుఖానుఁ డరుదెంచి దారాను, ఆతని రెండవ కుమారుని, ఇరువురు పుత్రికలను గూడ స్వాధీనపఱచుకొని, (23 తే) వారితో రాజధానికిఁ బ్రయాణ మాయెను.

దారాకు మరణము సన్నిహిత మయ్యెను. పట్టువడిన భ్రాతను వెంటనే వధింపక, యౌరంగజే బాతని నెంతేని పరాభవించెను. పంకదిగ్ధమగు నాడయేనుఁగుమీఁద వివృతమగు నంబారివేయించి, యందు దారాను సపుత్రకముగఁ గూర్చుండఁబెట్టి, ఢిల్లీనగరమంతటను ద్రిప్పించెను. సకలజన వంద్యుఁడై, మహావైభవాక్రాంతుఁడై వెలింగిన పాదుషా ప్రియనందనుఁడిపుడు రిపుసేనాపరివేష్టితుఁడై, శృంఖలాబద్ధుఁడై, మలినవస్త్రధారియై, హేయగజారూఢుఁడై, యనలసంకాశసూర్యాతప సంతప్తుఁడై హీనాతిహీనముగ నూరేగవలసిన వాఁ డయ్యెను. ప్రజలాదృశ్యము గాంచజాలక గొల్లున విలపించిరి. తదనంతర మతఁడు సపుత్రకముగఁ గారా గృహమున నిర్బంధితుఁ డయ్యెను.

దారాను వధింపవలయునని యౌరంగజేబు కృతనిశ్చయుఁడై యుండినను, నాఁటిసాయంకాల మావిషయము చర్చింపఁ

బడెను. దనీషమందుఖానుఁ డను వాఁడొక్కఁడు తక్క, తక్కుం గల మంత్రు లందఱును దారాను వధింపవలయునని కోరిరి.

మతక్షేమమును రాజ్యక్షేమమును దలంచి దారాను వధింపవలయునని వారు నిశ్చయించిరి. ఔరంగజేబు పక్షపాతి యగు రోషనారా భ్రాతృదయావిరహితయై వారిని మిక్కుట ముగఁ బ్రోత్సహించెను.*

దౌర్భాగ్యుఁడగు దారా యింకను జీవింప నాసించెను. తనకు రాజ్యేచ్ఛ లేదనియు, తన్ను వధింపఁబూను టధర్మమ నియు, దనకొక గృహమును నొక పరిచారికను నొసఁగినచో నౌరంగజేబు క్షేమముకొఱకు దైవమును బ్రార్థింపుచు గాల హరణ మొనరింతుననియు దారా సవినయముగ వ్రాసి పాదుషా యగు తనసోదరునకంపెను. కాని దారా కతంబునఁ జిరకాలము భంగపడిన యౌరంగజే బాతని నెట్లు క్షమింపఁగలడు ?

దారా వధ హృదయవిదారకము. దారా రెండవ కుమారుఁడు పదునాలుగేండ్ల బాలుఁడు, తండ్రి కుమారు లిర్వురును జెఱయం దుండిరి. చీఁకటి పడినంతనే యమభటులను బోలు రాజభటులు ప్రవేశించిరి. తొలుత నా తండ్రి కుమారులను విడదీసి తమ ఘాతుకకృత్య మాచరింపవలయునని వారు సమ

* "The malignant influence of his younger sister Raushanara was thrown into the scale against Dara, and her clamours silenced the feeble voice of mercy in a court where most ministers shaped their opinions after their master's inclinations." — Prof. J. N. Sarkar.

కట్టిరి. బాలకుఁడగు దారా కుమారుఁడు భయవిహ్వలుఁడై, తన జనకుని పాదములు గట్టిగఁ బట్టుకొనెను. విషాదావేశమున నంద్రికుమారుల పరస్పర గాఢాలింగన మొనరించి యొండొరుల వీడఁజాలకుండిరి. దయారహితులగు ఘాతలు కుపితులై యాడింభకుని నీడ్చివేయ సమకట్టిరి. దారా తనదుఃఖము దిగ మ్రింగి తనపుత్రునిఁ దన చెంతనుండనీయవలయునని కోరెను. తన ప్రార్థనను బాదుషా కెఱింగింపవలయునని హంతకులను బ్రతిమాలెను. దాన నాదుష్టుల దురాను గ్రహమును మడింప, హుంకరించి పైఁబడి, మొఱకుదనమున వారిని విడఁదీసిరి. వారి దుష్టసంకల్పము దారా కపుడు విస్పష్టమయ్యెను. పాప మాతఁడు క్రోధకంధురీణుఁడై గుప్తముగ దాచియుంచిన యల్పఖడ్గముం దీసి బలము కొలఁది నొక ముచ్చుప్రక్కను బొడిచెను. దానిని మగుడఁ బైకిఁ దీయఁజాలక దారా ముష్టి యుద్ధమునకుఁ దలపడెను. అట్టి కృత్యముల కలవాటుపడిన యాఘాతుకు లాతనిపైఁబడి యాక్రమించిరి. అలోపున, రెండవ గదినుండి కుమారుని మరణాక్రందనము హృదయము పగులు నట్లు వినవచ్చెను. ఒక్క నిముషమున నయ్యార్తస్వనము చల్లారెను. హంతకులంత దారాను బొడిచి పొడిచి పొలియించి, తదుత్తమాంగము నారంగజేబు పాదుషాకుఁ జూపిరి. అయ్యది దారా మస్తకమే యని గుర్తించి, పాదుషా యామృతకళేబర మును రాజధానియందుఁ ద్రిప్పించి హుమయూను గోరీయందు సమాధి చేయించెను.

---

